అనుష్క శర్మ నటిగా బాలీవుడ్‌లో పదేళ్ల ప్రయాణాన్ని పూర్తిచేసుకుంది. సినిమా నేపథ్యం, గాడ్‌ఫాదర్ లేకపోయినా తన ప్రతిభతో కెరీర్‌ను తీర్చుదిద్దుకున్న అనుష్క, నిర్మాతగానూ మారింది. ఈ పదేళ్ల ప్రయాణం గురించి అనుష్కా ఏం చెబుతోందంటే...

# ఇల్లే ప్రపంచం!



## టీనేజ్ మోడల్

ఏదో ఒక రంగంలో నాకంటూ గుర్తింపు తెచ్చుకోవాలని చిన్నప్పట్నుంచీ అనుకునేదాన్ని. మోడలింగ్ అంటే ఇష్టమని 13 ఏళ్లపుడు అమ్మానాన్నలకు చెప్పాను. దాంతో మేం అప్పుడున్న బెంగళూరులో మోడలింగ్ గురు 'ప్రసాద్ బిడాపా' దగ్గరికి తీసుకువెళ్లి నా ఆసక్తి గురించి చెప్పారు. 16 ఏళ్లకి మోడలింగ్ మొదలుపెట్టాను. 18 ఏళ్లకి దేశవ్యాప్తంగా ప్రదర్శనలకు వెళ్లాను.

## తొలి సినిమా

నాన్న ఆర్మీలో పనిచేయడంవల్ల ముంబయిలోని ఆర్మీ క్వార్టర్స్‌లో ఉంటూ సినిమా ప్రయత్నాలు చేశాను. అమ్మ నాతోపాటే ఉండేది. రెండేళ్ల ప్రయత్నం తర్వాత 19 ఏళ్లపుడు యశ్‌రాజ్ ఫిల్మ్స్‌లో ఛాన్స్ దొరికింది. మొదటి సినిమా షారుక్ ఖాన్‌తో 'రబ్‌నే బనాదీ జోడీ'.

## టెన్ ఇయర్స్ ఇండస్ట్రీ

'రబ్‌నే బనాదీ జోడీ' మంచి హిట్. ఆ తర్వాత అవకాశాలు పెరుగుతాయనుకున్నా కానీ అలా జరగలేదు. రెండేళ్ల తర్వాత వచ్చిన నా మూడో సినిమా 'బ్యాండ్ బాజా బారాత్'తో నాలోని నటిని పరిశ్రమ గుర్తించింది. పరిశ్రమలో నాకు గాడ్‌ఫాదర్ ఎవరూ లేరు. కథల ఎంపిక బాధ్యత పూర్తిగా నాదే. కథలో సహజత్వం ఉంటే ఎంపికచేసుకునేదాన్ని తప్ప, ఫార్ములా కథల్ని ఎంచుకోలేదు. పదేళ్లలో 15 సినిమాలు చేశాను. ఖాన్ త్రయంతో నటించా. మూడింటిలో షారుక్‌ఖాన్‌తో నటించా. ఈ రంగంలో నాకంటూ గుర్తింపు సాధించినందుకు ఎంతో సంతోషంగా ఉంది. దీనికి కారణం ఆ దేవుడు, నా కష్టం.

## నిర్మాతగా...

స్టార్‌డమ్‌లాంటి ఆలోచనలకు దూరంగా ఉండాలంటే పనిలో బిజీ అవ్వాలని పాతికేళ్లకే సొంత నిర్మాణ సంస్థని ప్రారంభించాను. మొదట్లో చాలామంది వద్దన్నారు. కానీ ముఖేష్‌భట్ ఒక్కరే నన్ను ప్రోత్సహించారు. మా బ్యానర్‌లో 'ఎన్‌హెచ్10', 'ఫిల్లౌరీ' సినిమాలు నిర్మించి నటించాను. నిర్మాతగా మారాక నా ఆత్మ విశ్వాసం మరింత పెరిగింది, ఇంకాస్త నిబద్ధతతో పనిచేయగలుగుతున్నాను.

## టీవీతో కాలక్షేపం

నన్ను నేను స్టార్‌గా ఎప్పుడూ అనుకోలేదు. అలా ఆలోచించి ఉంటే నా కెరీర్‌పైన ఆ ప్రభావం పడేది. స్టార్‌డమ్‌ని హ్యాండిల్ చేయడమూ కష్టమే. అందుకే ప్రజలకీ నా విజయాలకీ, డబ్బుతో వచ్చే సౌకర్యాలకూ దూరంగా నాదైన ప్రపంచంలో బతుకుతాను. సినిమాలు లేకుంటే ఇంట్లోనే కాలక్షేపం చేస్తా. అమ్మానాన్న(అషీమా, అజయ్ శర్మ), అన్నయ్య(కామేష్)లతోపాటు మా పెంపుడు కుక్క 'డ్యూడ్' ఉంటుంది. అన్నయ్యతోనే కెరీర్ గురించి మాట్లాడతాను. నా అభిరుచులకు తగ్గట్టు ఇల్లు కట్టించాను. పుస్తకాలు చదువుతూ, టీవీ చూస్తూ కాలక్షేపం చేయడమంటే ఇష్టం.

## విరాట్ గురించి చెప్పను

మాలాంటివారి వ్యక్తిగత విషయాల్లో మీడియా కాస్తయినా హుందాగా వ్యవహరించదు. విరాట్, నేనూ ఎక్కడికి వెళ్లినా అది వాళ్లకు వార్తే. అలాగని నేను కెమెరాలకు కనిపించకుండా ఉండాలనుకోను. తరచూ సోషల్ మీడియాలో మా ఫొటోలూ పెడుతుంటాం. కాకపోతే, మాకూ కొంత ప్రైవసీ ఉండాలంటాను. మొదట్లో విరాట్‌తో నా బంధం గురించి స్వేచ్ఛగా మాట్లాడేదాన్ని. సినిమాకి సంబంధించిన అంశాలు ఎన్ని చెప్పినా చివర్లో విరాట్ గురించి ఒక ప్రశ్న అడిగి, దాన్నే ప్రధానంగా చూపేవారు. సినిమాలపట్ల నా ఆసక్తీ అందుకోసం నేను పడే కష్టం... అన్నీ వెనక్కు వెళ్లేవి. అందుకే వ్యక్తిగత విషయాల్ని మీడియాకు చెప్పడం మానేశా.






మళ్లీ బొజ్జ గణపయ్య వచ్చేస్తున్నాడు. ఈసారి మట్టి గణపతితో పాటు మొక్క గణపతినీ పూజించవచ్చు. ఎలా అంటారా? మహారాష్ట్రకు చెందిన దత్తాద్రి కొత్తూర్ 'ట్రీగణేశా' పేరుతో మట్టి విగ్రహాలు తయారు చేస్తున్నాడు. అవి తయారు చేసేటప్పుడే ఎర్రమట్టిలో విత్తనాలూ అవి మొలకెత్త డానికి అవసరమైన సేంద్రియ ఎరువూ కలుపుతున్నాడు. ఈ గణపతి నిమజ్జనానికి ఎక్కడికో వెళ్లనక్కరలేదు. పెరట్లోనో, కుండీలోనో పెట్టి నీళ్లు పోస్తే చాలు. తాను కలిగి, పచ్చని మొక్కలా పెరుగుతాడు. దత్తాద్రి ప్రయత్నాన్ని మెచ్చి మహారాష్ట్ర సీఎం సత్కరించగా బాలీవుడ్ నటులు దియా మిర్జా, రితేశ్ దేశ్‌ముఖ్‌లాంటి వాళ్లు వచ్చి అతని వర్క్‌షాప్‌లో పాల్గొన్నారు. గత ఏడాది కొన్ని వందల విగ్రహాలు మాత్రమే తయారుచేయగలిగాననీ ఈ ఏడాది 5000 విగ్రహాలు చేయాలన్న ప్రయత్నంలో ఉన్నాననీ అంటున్నాడు దత్తాద్రి.

## మట్టి గణేశా... మొక్క గణేశా!



ఇక, హైదరాబాద్ నగరంలోని 'షేర్ ఎ సర్వీస్' అనే స్వచ్ఛంద సంస్థ విగ్రహం తయారు చేసేటప్పుడే ఓ చిన్న పూలమొక్కనూ దానికి అనుసంధానిస్తోంది. ఈ మొక్క గణపతికి పూజలు చేసి ఆ తర్వాత పూలకుండీలో పెడితే విగ్రహం కరిగిపోయి మొక్క పెరుగుతుందన్నమాట. మరికొందరు మట్టిగణపతులను తయారుచేస్తున్నవారు ఆ మట్టిలో తులసి విత్తనాలను కలిపి తయారు చేస్తున్నారు. అలా మట్టి గణపతి ఇప్పుడు మొక్క గణపతి అయిపోతున్నాడు!

# లోపల...







# మీ మాట



ఈ సంచికపై మీ అభిప్రాయాలను sunday@eenadu.netకు మెయిల్ చేయవచ్చు.

## స్నేహ మధురిమలు

ఈ వారం ముఖచిత్ర కథనం 'నేస్తం... సమస్తం!' పాత స్నేహితులను గుర్తుకు తెచ్చింది. మనకు సంబంధించిన ప్రతీ అంశంలో స్నేహితుల ప్రభావం ఉండటం ఆశ్చర్యపరిచింది. స్నేహానికి సంబంధించిన పరిశోధన విషయాలు కొత్తగా ఉన్నాయి.

*– కులకర్ణి చంద్రకాంత్‌రావు, మహబూబ్ నగర్*

*– ఎన్.వి.రమణమూర్తి (ఈమెయిల్)*

## నేటి కథ

'అంతరంగదర్పణం' కథ బాగుంది. ఉమ్మడి కుటుంబంలోని బాంధవ్యాలను చక్కగా వివరించారు. కోడళ్లను సొంత బిడ్డల్లా చూసుకోవడమే కాకుండా వారి అభిమానాన్నీ సొంతం చేసుకున్న సుధ పాత్ర ఆకట్టుకుంది.

*– సరిత కక్కెరి, హైదరాబాద్*

*– ఎస్. వరలక్ష్మి, విశాఖపట్నం*

## రాఖీ బాగుంది

మధ్యపేజీల్లో ఇచ్చిన రాఖీ సంగతులు బాగున్నాయి. చిన్నారులకు సంబంధించిన వివిధ రాఖీలు ఆకట్టుకున్నాయి. ఒక సాధువు ఆశయం సంస్థగా మారి అయిదువందల మందికి అన్నం పెట్టడం అభినందనీయం.

*– ఆర్. రవీంద్రనాథ్, ఆదిలాబాద్*

*– అమ్మిన వెంకట అమ్మిరాజు, పేరూరు*

## ఆదర్శం

అకున్ సబర్వాల్ జీవిత విశేషాలూ, ఉద్యోగంలో ఆయన ఎదిగిన తీరూ ఆదర్శవంతంగా ఉన్నాయి. 'ఇంగ్లిష్ చదువులు బస్తీల్లోకే' కథనం ఆసక్తికరంగా ఉంది. వివిధ రకాల వ్యర్థాలు మట్టిలో కలిసిపోవడానికి ఎంత సమయం పడుతుందో తెలిపిన వివరాలు ఆలోచింపజేశాయి.

*– బి.చంద్రకళ, తణుకు*

*– కె.భాన్విక, ఖమ్మం*

## కొత్తగా అనిపించాయి

విటమిన్ - ఎ బియ్యం, వంకాయరంగులో టొమాటో, నల్లబడని ఆపిల్ విశేషాలు కొత్తగా ఉన్నాయి. 'అరుదైన పుస్తకాలు అద్దెకు..!' కథనం పుస్తక ప్రియులకు ఉపయుక్తం.

*– గూని మోహన్ (ఈమెయిల్)*

*– ఆర్.సుగుణాభాయి, ఏలూరు*

## వినూత్నం

రెండురకాల భిన్నమైన జంతువులు చూడటానికి అచ్చం ఒకేలా ఉండటం వింతగొలిపింది. ప్రపంచంలోనే పొడవైన, ఎత్తయిన వేలాడే వంతెన విశేషాలు ఆసక్తికరంగా ఉన్నాయి. కిలారు ఇందు చెప్పిన తైవాన్ విశేషాలు అక్కడ విహరించిన అనుభూతిని కలిగించాయి.

*– డి. నాగమణి, విజయనగరం*

*– జి. అశోక్, జగిత్యాల*

## మంచిమాట

**కోపం, ద్వేషం, అసూయ వంటి పనికిమాలిన విషయాలతో నింపడానికి మనసు చెత్త డబ్బా కాదు. శాంతం, సంతోషం, ప్రేమ వంటి విలువైన భావాలతో నింపాల్సిన వజ్రాల పెట్టె.**

# సిద్ధి వినాయకుడి బ్రహ్మోత్సవం!



సత్యప్రమాణాల దేవుడిగా కాణిపాకం వినాయకుడికి పేరు. కోరిన కోర్కెలు తీర్చే కొంగుబంగారు స్వామిగా ఆయన్ను భక్తులు కొలుస్తారు. ఆ కాణిపాకం గణపయ్యకు వినాయక చవితి మొదలు 21 రోజుల పాటు అంగరంగ వైభవంగా బ్రహ్మోత్సవాలు జరగనున్నాయి.



గణపతి ప్రథమ పూజ్యుడు. విఘ్న వినాశకుడు. విద్యలకు ఒజ్జ. ఆయన్ను పూజించే వారికి కొండంత అండ. అందుకే గణపతి నవరాత్రులను దేశవ్యాప్తంగా ఘనంగా నిర్వహిస్తారు. ఇంటింటా గణపయ్యను కొలువు దీర్చి పత్రపుష్పాలతో అర్చిస్తారు. హైందవ సంప్రదాయంలో అంత ప్రాధాన్యమున్న గణపతికి తెలుగురాష్ట్రాల్లోని సుప్రసిద్ధ ఆలయం కాణిపాకం. ఇక్కడి వరసిద్ధి వినాయకుణ్ని దర్శించుకోవడానికి తెలుగు రాష్ట్రాలతో పాటు తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాల నుంచీ నిత్యం పెద్ద ఎత్తున భక్తులు వస్తుంటారు. ఇక్కడ ఏటా భాద్రపద శుద్ధ చవితి నుంచి జరిగే బ్రహ్మోత్సవాలకు ఎంతో విశిష్టత ఉంది. తొలి తొమ్మిది రోజులూ బ్రహ్మోత్సవాలతో పాటు, పదో రోజు నుంచి మిగతా పన్నెండు రోజులూ ప్రత్యేకోత్సవాలను నిర్వహిస్తారు. వార్షిక బ్రహ్మోత్సవాలుగా పిలిచే ఈ వేడుకను చూసేందుకు ఆలయానికి భక్తులు పోటెత్తుతారు.

### వెయ్యేళ్ల క్రితం...

చిత్తూరు జిల్లాలో బహుదా నదీ తీరంలో వెలసిన గణపయ్యకు వెయ్యేళ్ల చరిత్ర ఉంది. పూర్వం విహారపురి అనే ఊరిలో ధర్మాచరణ పరాయణులైన ముగ్గురు అన్నదమ్ములు వ్యవసాయం చేస్తూ జీవించేవారు. అందులో పెద్దవాడు గుడ్డివాడుగా జన్మించగా, మిగతా ఇద్దరూ మూగ, చెవిటివారిగా పుట్టారట. కొన్నాళ్లకు ఆ ఊరిని కరవు కమ్మేసింది. తాగేందుకూ నీళ్ల లేక అక్కడి ప్రజలు అల్లాడేవారు. ఈ నేపథ్యంలో ఈ సోదరులు పంటలు పండించుకునేందుకు తమ స్థలంలో ఒక బావిని తవ్వడం ప్రారంభించారు. అక్కడ ఒక పెద్దరాయి అడ్డు వచ్చింది. దాన్ని పెకిలించడానికి ప్రయత్నించారు. ఈ ప్రయత్నంలో రాయికి పార తగిలింది. వెంటనే రాయిలోంచి రక్తం చిమ్మినట్టుగా బయటకు వచ్చి ఆ సోదరుల మీద పడిందట. మరుక్షణం వారి వైకల్యం తొలగిపోయింది. ఈ విషయాన్ని వాళ్లు తమ ఊరి ప్రజలందరికీ చెప్పారు. పరుగుపరుగున బావి దగ్గరికి వచ్చిన గ్రామస్థులకు అందులో వినాయకుడి రూపం దర్శనమిచ్చిందట. ఆ స్వామికి ప్రజలంతా కొబ్బరికాయలు కొట్టి పూజలు నిర్వహించారు. ఆ కాయల నుంచి వచ్చిన నీరు కాణి (ఎకరం) దూరం పారిందట. అలా విహారపురికి 'కాణి పారకమ్' అని పేరు వచ్చింది. క్రమేణా అదే పేరు 'కాణిపాకం'గా మారింది. అలా బావిలో ఉద్భవించిన వినాయకుడి విగ్రహం నిత్యం పెరుగుతూ ఉండటం విశేషం. సుమారు 65 సంవత్సరాల క్రితం ఒక భక్తురాలు బహూకరించిన వెండికవచం, 2000 సంవత్సరంలో మరో భక్తుడు ఇచ్చిన తొడుగు స్వామికి ఇప్పుడు సరిపోకపోవడాన్ని ఇందుకు నిదర్శనంగా చెబుతారు. ఈ దేవుడి సన్నిధి సత్యప్రమాణాలకు ప్రసిద్ధం. ఇక్కడి పుష్కరిణిలో స్నానంచేసి తడిబట్టలతో స్వామి ఎదుట ప్రమాణం చేస్తారు. ఇక్కడ సామాన్య భక్తులే కాకుండా దురలవాట్లకు బానిసైన వారూ, రాజకీయ నాయకులు కూడా ప్రమాణాలు చేస్తుంటారు. అబద్ధం చెబితే స్వామి వాళ్లను తప్పక శిక్షిస్తాడని భక్తుల నమ్మకం. ఈ ఆలయానికి అనుబంధంగా మణికంఠేశ్వర స్వామి, మరగదాంబికా అమ్మవారు, వరదరాజస్వామి, వీరాంజనేయ స్వాముల గుళ్లున్నాయి.



### దొరకునా ఇటువంటి సేవ...

సిద్ధి వినాయకుడికి బ్రహ్మోత్సవ సేవ భాద్రపద శుద్ధ చవితినాడు ధ్వజారోహణ కార్యక్రమంతో ప్రారంభమవుతుంది. ఈ సందర్భంగా స్వామి వాహనమైన మూషిక పటం ఉన్న జెండాను ధ్వజస్తంభంపై ఎగరేస్తారు. తర్వాతి రోజు స్వామికి హంసవాహన సేవ. అందుకే ఆ రోజు స్వామిని దర్శిస్తే మనిషి లోని చెడు గుణాలు పోవడంతో పాటు సకల విద్యలూ సిద్ధిస్తాయని చెబుతారు. తర్వాత రోజు నెమలివాహన సేవ. మూడో రోజు మూషిక వాహన సేవ. తిరుమలలో గరుడ వాహనానికి ఎంత ప్రాధాన్యమో ఇక్కడ మూషిక వాహనానికి అంత ప్రాముఖ్యత ఉంటుంది. తరువాతి రోజు శేషవాహన సేవ. తిరుమల తరహాలోనే గణపతికీ చిన్నశేష వాహన సేవ, పెద్ద శేషవాహన సేవలను నిర్వహిస్తారు. తర్వాతి రోజు శివానుగ్రహాన్ని కలగజేసే వృషభవాహన సేవ. మర్నాడు గజవాహన సేవ. దీన్ని వీక్షించడం వల్ల మంచి ఆరోగ్యం సిద్ధిస్తుందట. తర్వాతి రోజు రథోత్సవం. మరుసటి రోజు జరిగే అశ్వ వాహన సేవను చూస్తే కోరికలు నెరవేరతాయట. వాహన సేవలన్నీ రాత్రి ఎనిమిదీ తొమ్మిది గంటల ప్రాంతంలో ప్రారంభమవుతాయి. తొమ్మిదో రోజు ధ్వజావరోహణం కార్యక్రమం జరుగుతుంది. తర్వాత వినాయకుడి మూల విరాట్టుకు పాయసం, వడలతో అభిషేకం చేస్తారు. దీన్ని 'వడాయత్తు ఉత్సవం' అని పిలుస్తారు. సాయంత్రం ఏకాంత సేవలో ఎండుపండ్లూ, బాదంపాలూ తదితరాలను నివేదించి, స్వామికి జోలపాటలు పాడతారు. తర్వాతి రోజు నుంచి ప్రత్యేక ఉత్సవాలు మొదలవుతాయి. అందులో స్వామిని అధికార నందివాహనం, కల్పవృక్షం, చంద్రప్రభ తదితర వాహనాల మీద ఊరేగిస్తారు. వీటిలో సెప్టెంబరు 9న జరిగే పుష్పపల్లకీ సేవ విశిష్టమైనది. దీనిలో పల్లకీ అలంకరణకు 20 నుంచి 40 టన్నుల పూలు వాడతారు. ఆ వేడుకను చూసేందుకు రెండు లక్షల నుంచి ఐదు లక్షల వరకూ జనం తరలివస్తారు. చివరి రోజు.... పుష్కరిణిలో తెప్పోత్సవం నిర్వహించడంతో బ్రహ్మోత్సవాల తంతు ముగుస్తుంది.

– కామిశెట్టి నరసింహులు, న్యూస్‌టుడే, కాణిపాకం

# జామతో ఆరోగ్యమెంతో..!






**జా**మకాయ ఆరోగ్యానికి మంచిదన్నది తెలిసిందే. కానీ అందులో మహత్తరమైన ఔషధగుణాలూ ఉన్నాయి అంటున్నారు పరిశోధకులు. ముఖ్యంగా అందులో అధికంగా ఉండే ఆస్ట్రిజెంట్స్, ప్రొస్టేట్, రొమ్ము క్యాన్సర్ల నిరోధానికి తోడ్పడతాయని తాజా పరిశోధనల్లో తేలింది. అంతేకాదు, ఇవి డయేరియాకీ మందులా పనిచేస్తాయి. ఈ ఆస్ట్రిజెంట్లు పండిన జామలోకన్నా పచ్చి జామలో ఎక్కువగా ఉంటాయి. ఇవి చర్మసౌందర్యాన్నీ పెంపొందిస్తాయి. ఆ కారణంతోనే ఇటీవల జామతో అనేక టోనర్లూ క్రీములూ వంటి రకరకాల సౌందర్యోత్పత్తుల్ని తయారుచేస్తున్నారు.

★ సిట్రస్ జాతి పండ్లలోకన్నా జామలో సి-విటమిన్ నాలుగు నుంచి పది రెట్లు ఎక్కువ. అందువల్ల ఇది అద్భుతమైన యాంటీఆక్సిడెంట్‌గా పనిచేస్తుంది. ఇందులోని కాపర్, థైరాయిడ్ గ్రంథి పనితీరుని క్రమబద్ధీకరిస్తుంది. జామలోని బి3, బి6 విటమిన్లు మెదడు, నరాల పనితీరునీ ప్రభావితం చేస్తాయి. ఈ కాయలు మూర్ఛ, బ్యాక్టీరియల్ ఇన్ఫెక్షన్లకీ మందులా పనిచేస్తాయి.

★ గులాబీ, ఎరుపు రంగు జామలో లైకోపీన్ టొమాటోల్లోకన్నా రెట్టింపు ఉంటుంది. ఇది జీవక్రియావేగానికీ పర్యావరణ కాలుష్యం నుంచి శరీరాన్ని కాపాడేందుకూ దోహద పడుతుంది.

★ అధికంగా ఉండే పీచు, తక్కువ గ్లైసెమిక్ ఇండెక్స్‌ల కారణంగా జామ మధుమేహులకి ఎంతో మేలు. వీటిల్లోని ఎలక్ట్రోలైట్ల కారణంగా ఇది బీపీ, హృద్రోగాలతో బాధపడేవాళ్లకీ ఎంతో మంచిది.

★ జామలోని ఫోలిక్ ఆమ్లం గర్భిణులకీ మేలే. ఇంకా ఇందులోని విటమిన్-ఎ, కంటిచూపునీ మెరుగుపరుస్తుంది.

★ తరచూ జలుబూదగ్గులతో బాధపడేవాళ్లు జామకాయను తినడంవల్ల ఆయా ఇన్ఫెక్షన్లూ తగ్గుతాయి.

★ పంటినొప్పికీ వాపులకీ జామాకు మంచి ఔషధం. దీన్ని నూరి గాయాలూ పుండ్లకి రాసినా వెంటనే తగ్గుముఖం పడతాయి.

## గాయాలకీ ప్రొబయోటిక్స్!



**సా**ధారణంగా గాయంమీద బ్యాక్టీరియా, వైరస్‌లాంటి సూక్ష్మజీవులు చేరడంవల్ల అది మరింత పెరిగి ఇన్ఫెక్షన్లకు కారణమవుతుంది. అందుకే ఆ గాయం త్వరగా తగ్గడానికి యాంటీబయో టిక్స్ ఇస్తుంటారు వైద్యులు. కానీ ముున్ముందు వాటికి బదులుగా ప్రొబయోటిక్స్ ఇచ్చే అవకాశం ఉంది. ఆరోగ్యానికి మేలు చేసే సూక్ష్మజీవుల్ని ప్రొబయోటిక్స్ అంటారన్నది తెలిసిందే. ఇవి కేవలం పొట్ట ఆరోగ్యానికే కాదు, చర్మ ఆరోగ్యానికీ దోహదపడుతాయి అంటున్నారు మాంచెస్టర్ విశ్వవిద్యాలయానికి చెందిన నిపుణులు. అదెలా అంటే- ప్రొబయోటిక్స్, వాటి చుట్టుపక్కల హానికర సూక్ష్మజీవులు చేరకుండా చేస్తాయట. ఈ విషయాన్ని ఎలుకల్లో చేసిన పరిశోధనల ద్వారా నిర్ధరించుకున్నారు. అందుకే అలాంటి బ్యాక్టీరియాను చొప్పించి తయారుచేసే ఆయింట్‌మెంట్లు లేదా క్రీములు యాంటీబయోటిక్స్‌కన్నా శక్తిమంతంగా పనిచేస్తూ, గాయాల్ని త్వరగా మానేలా చేస్తాయంటున్నారు.

## గ్రీన్ టీతో దంతాలకూ రక్ష!

**వే**డి టీ తాగుతున్నా చల్లని పానీయాలు తాగుతున్నా పళ్లు జివ్వున లాగుతున్నాయంటే ఎనామిల్ దెబ్బతిందన్న విషయాన్ని గ్రహించాలి. దీనికోసం కొన్ని చికిత్సలు వాడుకలోకి వచ్చినా వాటి వల్ల ఫలితం అంతంతమాత్రమే. కానీ గ్రీన్‌టీలోని ఎపిగాలోకెటెచిన్-3-గాలేట్ అనే పదార్థం, దంతాల మీద ఉండే డెంటిన్ దెబ్బతినడానికీ రంధ్రాలు ఏర్పడ్డానికీ కారణమైన బ్యాక్టీరియాతో పోరాడటం ద్వారా దంతాలను రక్షిస్తుందని చైనాలోని వుహాన్ విశ్వవిద్యాలయానికి చెందిన పరిశోధకులు చెబుతున్నారు. దాంతో వాళ్లు ఆ పదార్థాన్ని క్యాప్సూల్స్‌గా మార్చి పాడయిన దంతాలమీద ప్రయోగించారట. ఆ క్యాప్సూల్‌ను నోట్లో పెట్టుకోగానే అందులోనుంచి ఎపిగాలో కెటెచిన్-3 గాలేట్ అనే ఆ పదార్థం విడుదలై, దంతాలమీద బ్యాక్టీరియా చేరకుండా అడ్డు కుంటుందని ఆ పరిశోధనలో స్పష్టమైంది. దీని ప్రభావం 96 గంటలపాటు ఉంటుందనీ బ్రష్ చేసినా కూడా పోవడం లేదనీ గుర్తించారు. దీన్నిబట్టి దంతాలమీద ఎనామిల్ దెబ్బతిన్నవాళ్లకి గ్రీన్ టీ మంచి మందే అని తెలుస్తోంది.



## టూకీగా...

**తి**య్యని కేకులూ శీతలపానీయాలూ ఎక్కువగా తీసుకోవడం వల్ల మధుమేహం, ఊబకాయం, మతిమరుపు, డిప్రెషన్‌లు వచ్చే అవకాశం ఉందనీ; మహిళలతో పోలిస్తే పురుషుల్లో 23శాతం ఎక్కువనీ లండన్ యూనివర్సిటీ కాలేజీకి చెందిన పరిశోధకులు వివరిస్తున్నారు

★ మెలనోమా అనే ఒకరక మైన చర్మ క్యాన్సర్ నివారణకు విటమిన్ బి-3 దోహదపడుతుం దనీ, ఇది పాలూ గుడ్లూ చేపలూ కూరగాయల్లో సమృద్ధిగా దొరు కుతుందనీ చెబుతున్నారు ఆస్ట్రేలియాలోని సిడ్నీ యూని వర్సిటీకి చెందిన పరిశోధకులు.

## ఆడవాళ్లే చురుకు!

**సా**ధారణంగా మహిళలతో పోలిస్తే పురుషుల్లోనే మేధస్సు ఎక్కువగా ఉంటుందనీ ఆలోచనాపరులనీ అంటుంటారు. అందులో నిజానిజాల సంగతెలా ఉన్నా మెదడు చురుకుదనంలో మాత్రం మహిళలదే పైచేయి అంటున్నారు యూనివర్సిటీ ఆఫ్ టెక్సాస్‌కు చెందిన నిపుణులు. ఇందుకోసం వీళ్లు మెదడుకు సంబంధించి విభిన్న కోణాల్లో తీసిన స్కానింగుల్ని పరిశీలించినప్పుడు- మెదడులోని రెండు మూడు భాగాల్లో తప్పించి మిగిలిన అన్ని భాగాల్లోనూ రక్త సరఫరా స్త్రీల్లోనే ఎక్కువగానూ వేగంగానూ ఉందనీ దీన్నిబట్టి పురుషులకన్నా స్త్రీల మెదడే చురుగ్గా పనిచేస్తుందనీ వాళ్లు అభిప్రాయపడుతున్నారు. అంతేకాదు, స్కిజోఫ్రీనియా, ఆల్జీమర్స్, డిప్రెషన్... వంటి విభిన్న మానసిక వ్యాధులకు చికిత్స చేయడానికీ ఈ పరిశోధన ఉపయోగపడుతుందని భావిస్తున్నారు.



**విదేశాల్లో చదువుకున్న కార్పొరేట్ దిగ్గజాలు లేరు. అత్యున్నత బిజినెస్ స్కూళ్ల నుంచి పట్టభద్రులైన ఉద్యోగులు లేరు. ప్రచారానికి కనీసం సినిమా, క్రీడా ప్రముఖులు కూడా లేరు. అయినా సరే 'పతంజలి' కేవలం పదేళ్లలో రూ.10వేల కోట్ల విలువైన వ్యాపార సామ్రాజ్యాన్ని సృష్టించింది. దశాబ్దాల తరబడి పాతుకుపోయిన విదేశీ సంస్థల్ని కలవరపెడుతూ, అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతున్న భారతీయ సంస్థగా అవతరించింది. స్వదేశీ ఉత్పత్తుల పేరుతో బాబా రామ్‌దేవ్ ఎక్కుపెట్టిన ఈ ఆయుర్వేద బాణం, ఒక సంస్థ కాదు... సంచలనం, ఒక విప్లవం.**

# పతంజలి

## రామ్‌దేవ్ విసిరిన రాకెట్టు!

బాబా రామ్‌దేవ్... యోగా ప్రాశస్త్యం గురించి వివరిస్తూ సైకిల్ మీద వీధి వీధీ తిరిగారు. ఆపైన బుల్లితెరపైన యోగా పాఠాలు నేర్పారు. ప్రపంచానికి మన దేశమిచ్చిన గొప్ప వరం యోగాభ్యాసం అని ప్రచారం చేశారు. ప్రజలూ, సినీ ప్రముఖులూ, నాయకులూ, విదేశీయులూ... అంతా ఆయన మాటల్ని నమ్మారు. ఆయన పాఠాల్ని ఆకళింపు చేసుకున్నారు. ఆయన సూత్రాలతో జీవనశైలిని మార్చుకున్నారు. ఫలితం... కోట్లాది భారతీయులు ఆ బక్కపల్చని బాబాకి ఏకలవ్య శిష్యులయ్యారు.

అదే బాబా రామ్‌దేవ్... ప్రజల్లో తనకున్న ఆదరణా, అభిమానమే పెట్టుబడిగా స్నేహితుడితో కలిసి 'పతంజలి' పేరుతో ఆయుర్వేద ఉత్పత్తుల సంస్థకు ప్రాణం పోశారు. ప్రపంచానికి ప్రకృతి ఇచ్చిన గొప్ప వరం ఆయుర్వేదమని ప్రచారం చేశారు. మనిషి శరీరంలోని అన్ని సమస్యలనూ నయం చేసే శక్తి ఆయుర్వేదానికి ఉందని సందర్భం దొరికినప్పుడల్లా చెబుతూ వచ్చారు. ఈసారీ సామాన్యుల నుంచీ సెలెబ్రిటీల దాకా అందరూ ఆయన మాటల్ని నమ్మి, ఆ ఉత్పత్తులను కొనడం మొదలుపెట్టారు. ఫలితం... అతి తక్కువ కాలంలో రూ. 10వేల కోట్ల టర్నోవర్ సాధించిన భారతీయ ఎఫ్‌ఎమ్‌సీజీ రంగ సంస్థగా ఈ ఏడాది పతంజలి రికార్డు సృష్టించింది. దశాబ్దాల చరిత్ర కలిగిన సంస్థల్ని వెనక్కి నెట్టి అత్యంత ప్రభావశీల సంస్థల జాబితాలో గూగుల్, మైక్రోసాఫ్ట్, ఫేస్‌బుక్‌ల తరవాత నాలుగో స్థానంలో నిలిచింది. రాబోయే రోజుల్లో దేశంలోనే అతిపెద్ద ఎఫ్‌ఎమ్‌సీజీ సంస్థగా అవతరించే దిశగా పతంజలి వడివడిగా అడుగులేస్తోంది.

పతంజలి పేరు చెబితే మొదట స్ఫురించేది బాబా రామ్‌దేవ్ రూపమే. సంస్థ ఉనికికీ, విస్తరణకూ ఆయనకున్న ఆదరణే చాలా వరకూ కారణమన్నది అందరి అభిప్రాయం. కానీ చెట్టు పేరు చెప్పి కాయలమ్మడం ఎంతో కాలం సాధ్యం కాదు. కేవలం రామ్‌దేవ్ ప్రచారం వల్లే సంస్థ ఇంత దూరం వచ్చిందన్న వాదనలోనూ నిజం లేదు. పైకి పదేళ్లలో సంస్థ ఎదిగినట్లు కనిపించినా, దాని వెనక ముప్ఫయి ఏళ్ల కష్టం ఉందంటారు రామ్‌దేవ్. ఆయన మాట సాయంతో పాటు అనూహ్యమైన మార్కెటింగ్ శైలి, అతివేగంగా విస్తరించిన సంస్థ రిటైల్ స్టోర్లు, పోటీ సంస్థలని ఆత్మరక్షణలో పడేసే ధరలు, అన్నింటికీ మించి వినియోగదార్ల హృదయాల్ని సూటిగా తాకే ప్రచార పంథా 'పతంజలి' విజయానికి ముఖ్య కారణాలన్నది మార్కెట్ నిపుణుల విశ్లేషణ. ఆ ఎదుగుదల క్రమంలో పతంజలి అడుగులు, స్టార్టప్ వీరుల నుంచీ కార్పొరేట్ దిగ్గజాల వరకూ అందరికీ గెలుపు పాఠాలు.

### పైసా పెట్టుబడి లేకున్నా...

పతంజలి ఆయుర్వేద సంస్థ ప్రారంభమై తొమ్మిదేళ్లయింది. కానీ దానికి పునాది 22ఏళ్ల క్రితమే పడింది. దివ్య ఫార్మసీ... పతంజలి సంస్థకి తొలిరూపు ఈ చిన్న ఔషధ దుకాణమే. 1995లో హరిద్వార్‌లోని కన్‌కల్ ప్రాంతంలో స్నేహితుడు బాలకృష్ణతో కలిసి రామ్‌దేవ్ దీన్ని తెరిచారు. యోగా, ఆయుర్వేదం... ఈ రెండు రంగాల అభివృద్ధికి సాయపడటాన్ని గురువు బల్‌దేవ్ తనపైన పెట్టిన బాధ్యతగా రామ్‌దేవ్ భావించేవారు. యోగా గురువుగా అప్పటికే స్థానికంగా రామ్‌దేవ్‌కు మంచి పేరొచ్చింది. ఆయన స్నేహితుడు బాలకృష్ణకు ఆయుర్వేదంపైన తిరుగులేని పట్టుంది. ఇద్దరూ చిన్నప్పుడు ఒకే ఆశ్రమంలో పెరిగారు. తరవాత హిమాలయాలకూ కలిసే ప్రయాణమయ్యారు. అక్కడ రామ్‌దేవ్ యోగా సాధనలో నిమగ్నమైతే, బాలకృష్ణ ఆయుర్వేదంలో నైపుణ్యం సాధించారు.

హరిద్వార్‌కు తిరిగొచ్చాక రామ్‌దేవ్ యోగా



# ఆచార్య... అన్నీ తానై

ఆచార్య బాలకృష్ణ... 'పతంజలి'లో 94శాతం వాటా ఆయనదే. ఆయన అసలు పేరు నారాయణ్ ప్రసాద్ సుబేదీ. నేపాల్‌లో పుట్టిన ఆయన పెరిగిందంతా భారత్‌లోనే. సంస్థ ముఖచిత్రం రామ్‌దేవ్ అయితే, దాని చోదక శక్తి బాలకృష్ణ. ముప్పయ్యేళ్లుగా రామ్‌దేవ్‌కి సన్నిహితుడిగా ఉంటున్న బాలకృష్ణకి ఆయుర్వేద విద్యలో అద్భుతమైన నైపుణ్యం ఉంది. కాలక్రమంలో మరుగునపడిన ఎన్నో ఆయుర్వేద సూత్రాలను ఆయన వెలికి తీసి వాటి ఆధారంగా తిరిగి ఆ ఔషధాలను తయారు చేశారన్న పేరుంది. యోగ విద్య, సంస్కృతం, వేదాలనూ ఆయన ఆపోశన పట్టారు. తొలిదశలో సంస్థ తీసుకొచ్చిన ఔషధాలూ, ఉత్పత్తులన్నీ ఆయన సృష్టే. ప్రచారం చేసేది రామ్‌దేవ్ అయినా దాని వెనకుండే వ్యూహకర్త బాలకృష్ణే. ప్రయోగశాల నుంచి బయటికొచ్చిన ప్రొడక్ట్‌ని ఆమోదించి, దాన్ని ప్యాక్ చేసి మార్కెట్‌కి తరలించేవరకూ ప్రతి పనీ ఆయన కనుసన్నల్లోనే జరుగుతుంది. సంస్థని మొదలుపెట్టాక ఒక్కరోజు కూడా వ్యక్తిగత పనుల కోసం సెలవు తీసుకోలేదనీ, రోజూ ఉదయం ఏడు నుంచి రాత్రి పది వరకూ సంస్థ పనుల్లోనే నిమగ్నమవుతాననీ బాలకృష్ణ అంటారు. 'పతంజలి ఆయుర్వేద్'కు ఎండీగా ఉన్న ఆయన, మరో 34 అనుబంధ సంస్థలకూ అధినేత. నిత్యం తెల్లని దుస్తులు వేసుకొని సాదాసీదాగా కనిపించే ఆయన కంప్యూటర్ సాయం తీసుకోకుండా కేవలం కాగితాల ద్వారానే వ్యాపార లావాదేవీల్ని నిర్వహిస్తారు. మార్కెట్ సర్వేల జోలికి పోకుండా తాను అనుకున్నది నిజమై తీరుతుందన్న నమ్మకంతో అడుగేస్తారు. 'అల్లం జ్యూస్‌ని మార్కెట్లోకి తెచ్చే ముందు కొందరు సన్నిహితులు మొదట మార్కెట్ సర్వే చేయించమన్నారు. కానీ నేను మనస్సాక్షిని నమ్మి దాని తయారీ మొదలుపెట్టా. ఇప్పుడు అత్యధికంగా అమ్ముడయ్యే మా ఉత్పత్తుల్లో అదీ ఒకటి' అంటారు బాలకృష్ణ. రూ.25వేల కోట్ల రూపాయలకుపైగా ఆస్తులతో గతేడాది ఫోర్బ్స్ సంపన్నుల జాబితాలో 48వ స్థానాన్ని దక్కించుకున్న ఆయన, 'మా లాభాల్ని సేవా కార్యక్రమాల వైపు మళ్లిస్తాం కాబట్టి నేను ఎక్కువ కాలం ఆ జాబితాలో కొనసాగలేకపోవచ్చు' అని చెబుతారు.



శిక్షణలో మునిగిపోయారు.

ఆ క్రమంలో కొంత శిష్య గణాన్నీ సమకూర్చుకున్నారు. మరోపక్క బాలకృష్ణ ఆయుర్వేద ప్రయోగాల్లో లీనమయ్యారు. అనేక ఆరోగ్య సమస్యలకు ఆయుర్వేద ఔషధాలను తయారుచేసే పనిలో పడ్డారు. రామ్‌దేవ్ ఉచిత శిక్షణ ద్వారా హరిద్వార్‌లో చాప కింద నీరులా యోగా ప్రాబల్యం విస్తరించింది. దాంతో యోగాకి ప్రాచుర్యం తేవాలన్న ఆయన లక్ష్యం కొంతవరకూ నెరవేరింది. కానీ వ్యాపారం మొదలుపెడితే తప్ప ఆయుర్వేద ఉత్పత్తులకు ప్రచారం దక్కే పరిస్థితి లేదు. ఆ పని చేయడానికి స్నేహితులిద్దరి దగ్గరా చిల్లి గవ్వలేదు. ఆ సమయంలో కొందరు శిష్యులూ, శ్రేయోభిలాషులూ రామ్‌దేవ్‌ని ఆదుకున్నారు. గురు దక్షిణగా ఐదు లక్షల రూపాయలను ఆయనకి అందించారు. అదే వాళ్ల వ్యాపారానికి తొలి పెట్టుబడి. ఆ డబ్బు సాయంతో బాలకృష్ణ కనిపెట్టిన ఆయుర్వేద సూత్రాలకు అనుగుణంగా కొన్ని ఉత్పత్తులను తయారు చేశారు. హరిద్వార్‌లో దివ్య ఫార్మసీ పేరుతో దుకాణాన్ని తెరిచి వాటిని అమ్మకానికి పెట్టారు. కేవలం ఉత్పత్తుల్ని అమ్మడం కాకుండా, ఆయుర్వేద ప్రాధాన్యాన్ని విస్తరించడమే ఆ స్నేహితుల లక్ష్యంగా ఉండేది. అందుకే తమపైన నమ్మకంతో వచ్చిన పేదలకు వీలైతే ఉచితంగా, లేదంటే నామమాత్రపు ధరకే తమ ఉత్పత్తులను అందించేవారు.

### టీవీతో మొదలు...

రామ్‌దేవ్ జీవితానికీ, ఆయన నెలకొల్పిన వ్యాపారానికీ మలుపు 21వ శతాబ్దం తొలి రోజుల్లో పడింది. అప్పటిదాకా హరిద్వార్‌లో ఆసక్తి ఉన్నవాళ్లకి యోగా నేర్పుతూ వచ్చిన రామ్‌దేవ్‌కి 'సంస్కార్' ఛానెల్‌లో తెల్లవారుజామున ఓ ఇరవై నిమిషాల పాటు యోగా కార్యక్రమాన్ని నిర్వహించే అవకాశం దొరికింది. ఆయన నేర్పే ఆసనాల ద్వారా మంచి ఫలితాలు వస్తున్నాయంటూ నోటి మాట ద్వారా ప్రచారం దక్కడంతో నెమ్మదిగా కార్యక్రమానికి ఆదరణ పెరిగింది. అలా దేశ వ్యాప్తంగా ఆయన్ని గుర్తుపట్టేవారి సంఖ్య ఎక్కువవుతూ వచ్చింది. ఆపైన మూడేళ్లకు మరో ఛానెల్ 'ఆస్థా'తో నేరుగా లైవ్ కార్యక్రమంలో యోగా నేర్పడానికి ఒప్పందం కుదిరింది. దాంతో ఆయన పరిధి సామాన్యుల నుంచి ప్రముఖులకు విస్తరించింది. ఎందరో ఉత్తరాది రాష్ట్రాల రాజకీయ నేతలూ, సినీ ప్రముఖులూ ఆయన పాఠాలను అనుసరించడం మొదలుపెట్టారు. క్రమంగా భారీ బహిరంగ వేదికలపైన యోగా శిక్షణ కార్యక్రమాలను నిర్వహించే స్థాయికి ఎదిగారు. అలా పెరిగిన పేరు ప్రతిష్ఠలే రామ్‌దేవ్ వ్యాపారానికి వరంగా మారాయి. యోగా పాఠాల్లో భాగంగానే ఆయుర్వేదానికీ ఆయన ప్రచారం కల్పించేవారు. ఇంకోపక్క ఆయన స్నేహితుడు బాలకృష్ణ ప్రయోగశాలను ఏర్పాటు చేసి ఆయుర్వేద ఉత్పత్తుల తయారీనీ పెంచారు. ఆ రెండు విభాగాల అభివృద్ధి కోసం 2006లో హరిద్వార్ దగ్గర పతంజలి యోగా పీఠాన్ని ఏర్పాటు చేశారు. ఆ కార్యక్రమానికి పదిహేను



## సంస్థ ముఖచిత్రం

**బాబా రామ్‌దేవ్... 'పతంజలి'లో అధికారికంగా నయాపైసా వాటా లేకపోయినా, దాని విజయానికి పునాది వేసింది ఆయనే. సన్యాసి అయిన తనకు డబ్బుతో అవసరం లేదని రామ్‌దేవ్ అంటారు. కానీ బహుళజాతి సంస్థల ఆధిపత్యాన్ని తగ్గించి, ప్రజలను స్వదేశీ బాట పట్టించి, ఇక్కడి సంపద విదేశాలకు తరలకుండా ఇక్కడే ఖర్చయ్యేలా చూడటం తన బాధ్యతని చెబుతారు. అందుకే పతంజలిలో కీలక పాత్ర పోషిస్తూ, సంస్థ ఉత్పత్తులకు ప్రచారం కల్పించడంతో పాటు అవి మార్కెట్లోకి విడుదలయ్యే ముందు స్వయంగా తానే వాటిని వాడి చూస్తానని చెబుతారు. గతంలో ఎప్పుడూ నూడుల్స్ రుచి చూడని ఆయన, సంస్థ వాటి ఉత్పత్తిని మొదలుపెట్టడానికి ముందు చాలా రోజులపాటు నూడుల్స్‌ని ఆహారంలో భాగం చేసుకున్నారట. సంస్థలో కీలక స్థానాలకు ఉద్యోగులను ఆయనే ఇంటర్వ్యూ చేసి ఎంపిక చేస్తారు.**



## కనిపించని శక్తి



**రామ్ భరత్... బాబా రామ్‌దేవ్ తమ్ముడైన ఆయన 'పతంజలి' రోజు వారీ వ్యవహారాలన్నీ చూసుకుంటారు. సంస్థకు అనధికారిక సీయీవోగా ఆయనకు పేరుంది. మీడియా కంటికి ఏమాత్రం చిక్కని ఆయన వ్యాపారానికి సంబంధించిన కీలక సమావేశాలు నిర్వహించడంతో పాటు ఉద్యోగులూ, బాలకృష్ణ, రామ్‌దేవ్‌లకు మధ్య వారధిలా పనిచేస్తున్నారు. సంస్థ విస్తరణలో తమ ఇద్దరి తరవాత కీలక పాత్ర భరత్‌దే అంటారు బాలకృష్ణ.**

రాష్ట్రాల ముఖ్యమంత్రులు హాజరవడంతో ఒక్కసారిగా దేశవ్యాప్తంగా రామ్‌దేవ్ పేరు చర్చనీయాంశమైంది. ఆపైన మూడేళ్లకు ఆ ప్రాంగణంలోనే బాలకృష్ణతో కలిసి రామ్‌దేవ్ 'పతంజలి ఆయుర్వేద్' సంస్థను నెలకొల్పి పెద్ద ఎత్తున ఆయుర్వేద ఉత్పత్తుల తయారీ మొదలుపెట్టారు. ఆయనకి ఉన్న గుర్తింపు ఫలితంగా తొలి ఏడాదిలోనే అది రూ.60కోట్ల టర్నోవర్‌ని సాధించి ఆ రంగంలోని సంస్థలకు గట్టి హెచ్చరికలే పంపింది.

### స్వదేశీ నినాదం

సాధారణంగా ఏదైనా వ్యాపారం వల్ల వ్యక్తికి గుర్తింపు వస్తుంది. కానీ 'పతంజలి'కి ఆ సూత్రం వర్తించదు. ఇక్కడ రామ్‌దేవ్ వల్లే ఆ సంస్థకి గుర్తింపు దక్కింది. ఈ రోజుకీ దాని ప్రచార బాధ్యతలు ఆయన భుజాల మీదే ఉన్నాయి. 'పతంజలి'ని ఏర్పాటు చేసిన సమయంలోనే 'భారత్ స్వాభిమాన్' ఉద్యమాన్నీ మొదలుపెట్టడం రామ్‌దేవ్‌లోని వ్యాపార కోణానికి నిదర్శనం. బహుళ జాతి సంస్థల వల్ల దశాబ్దాలుగా దేశ సంపద కరిగిపోతోందనీ, వాటి ఉత్పత్తులు దేశానికి మంచికంటే చెడే ఎక్కువ చేశాయనీ ప్రచారం చేస్తూ వాటిని బహిష్కరించాలంటూ ఉద్యమాలు చేశారు. మరోపక్క 'పతంజలి' ఉత్పత్తులు మహాత్మా గాంధీ బోధించిన స్వదేశీ సిద్ధాంతాలకు నిదర్శనమనీ, వాటి అమ్మకాల ద్వారా వచ్చే డబ్బు తిరిగి జాతి నిర్మాణానికే ఉపయోగపడుతుందంటూ ప్రచారం చేపట్టారు. ఇప్పటికీ 'ఐ సపోర్ట్ స్వదేశీ' పేరుతో ఆన్‌లైన్ ఉద్యమాన్ని నడిపిస్తున్నారు. వినియోగదార్ల అవసరాలతో పాటు వాళ్ల దేశభక్తి భావాల్నీ లక్ష్యంగా చేసుకొని సంధించిన ఈ ప్రచార బాణం ప్రజల హృదయాన్ని సూటిగా తాకింది. సంస్థ అతి తక్కువ కాలంలోనే అనూహ్యంగా విస్తరించడానికి ఈ 'స్వదేశీ' కోణం మొదటి కారణం.

### 'సహజ' ప్రచారం...

రానురానూ కల్తీల ప్రభావం పెరిగిపోవడం, నిత్యం వినియోగించే ఎన్నో పదార్థాలు రసాయనాల మయం కావడం, ఇటీవలి కాలంలో జనాలు ఆర్గానిక్ ఉత్పత్తులవైపు మొగ్గు చూపడానికి ఓ ప్రధాన కారణం. ఆ విషయాన్ని రామ్‌దేవ్ గ్రహించారు. సహజ సిద్ధమైన ఉత్పత్తులపైన వినియోగదారులు ఆసక్తి చూపుతున్నారని అర్థం చేసుకున్నారు. దాంతో తన ప్రచారంలో రెండో స్థానం దానికే కేటాయించారు. 'మా ఉత్పత్తులన్నీ పూర్తిగా ప్రకృతిలో దొరికే ముడిసరకుతో తయారు చేసినవే, వీటిలో ఎలాంటి రసాయనాలూ లేవు' అంటూ ప్రచారం చేశారు. దానికితోడు 'ఇన్నాళ్లూ రసాయనాలతో నిండిన ఉత్పత్తులు వాడి ఆరోగ్యాన్ని పాడుచేసుకున్నారు. ఇకపై మీకా అవసరం లేదు' అంటూ వినియోగదార్లను ఆలోచనలో పడేశారు. ఫలితంగా ఆయుర్వేద ఉత్పత్తుల వల్ల మేలు జరిగినా, లేకున్నా హాని మాత్రం జరగదనే భావనని వాళ్లలో రేకెత్తించి, తక్కువ సమయంలోనే వాళ్ల దృష్టిని తమవైపు లాగారు. పతంజలి విజయానికి ఇది రెండో కారణం.

### తక్కువ ధరలు!

ఇతర బ్రాండ్ల గోధుమ పిండి కిలో, పతంజలి గోధుమ పిండి కిలో... రెంటినీ పక్కన పెట్టి చూస్తే పతంజలికి చెందిన పిండి ధర తక్కువగా ఉన్నట్లు కనిపిస్తుంది. ఆ సంస్థ నుంచి వచ్చే దాదాపు అన్ని ఉత్పత్తుల ధరల్లోనూ ఈ వ్యత్యాసం స్పష్టమవుతుంది. ఇతర సంస్థలతో పోలిస్తే లాభాల విషయంలో తాము స్వీకరించే మార్జిన్ తక్కువగా ఉంటుందనీ, తమ స్టోర్లు భారీ హంగులతో కాకుండా చాలా సాదాసీదాగా ఉండటంతో వాటి నిర్వహణలో మిగిలిన ఖర్చుని వినియోగదార్లకు బదలాయిస్తామనీ సంస్థ చెబుతోంది. ప్రచారం కోసం సెలెబ్రిటీలను వాడుకోకపోవడం వల్ల ఆదా అయ్యే డబ్బు కూడా తమ ధరలపైన ప్రభావం చూపుతుందని అంటోంది. మధ్యవర్తులతో పనిలేకుండా నేరుగా రైతుల నుంచే ముడిసరుకు కొనడం ద్వారానూ కొంత ఖర్చు తగ్గుతోంది. కారణమేదైనా తమ ఉత్పత్తుల ధరలు తక్కువన్న విషయాన్ని పతంజలి త్వరగానే జనాల్లోకి తీసుకెళ్లింది.






## ఆదాయమంతా సేవకే!

పతంజలిలో కొందరు ఉద్యోగులు జీతాలు తీసుకోకుండానే పనిచేస్తారట. వాళ్లు తమ ఉద్యోగాన్ని సమాజ సేవగా భావిస్తూ పతంజలి ఆశ్రమాల్లోనే ఉంటూ రోజువారీ పనుల్లో పాల్గొంటారు.

★ రామ్‌దేవ్, బాలకృష్ణలను ఉద్యోగులంతా 'ఆచార్య' అనే సంబోధిస్తారు. వాళ్ల ముందు ఎవరూ చెప్పులేసుకోరు సరికదా, ఇద్దర్లో ఎవరు ఎదురుపడ్డా చేస్తున్న పని ఆపేసి మరీ ఆశీర్వాదం తీసుకోవడం అక్కడ ఆనవాయితీగా వస్తోంది.

★ నూడుల్స్, గోధుమపిండి, ఎరువుల లాంటి భిన్నమైన ఉత్పత్తుల రంగంలోకి అడుగుపెట్టిన తొలి ఆయుర్వేద సంస్థ పతంజలి. ఇప్పుడు మరో అడుగు ముందుకేస్తూ త్వరలో దుస్తులనూ తయారు చేయనున్నట్లు ప్రకటించింది. జీన్స్‌తో సహా పిల్లల నుంచి పెద్దల వరకూ అందరికీ అనువైన దుస్తులను ఉత్పత్తి చేయనుందట.

★ పతంజలి ఆదాయంలో సింహ భాగం సేవా కార్యక్రమాలకే కేటాయిస్తున్నట్లు రామ్‌దేవ్ చెబుతారు. ఇప్పటికే దేశవ్యాప్తంగా వెలుస్తున్న పతంజలి విద్యా కేంద్రాలూ, ఆయుర్వేద చికిత్సాలయాలను దానికి సాక్ష్యంగా చూపిస్తారు. మొత్తం ఆదాయంలో ఎనభై శాతం విద్యపైనా, మిగతాది ఇతర సేవల కోసం ఖర్చుచేయాలన్నది తన ఆలోచన అంటారు రామ్‌దేవ్.

★ గతంలో కేవలం పతంజలి కేంద్రాల్లో మాత్రమే ఆ సంస్థ ఉత్పత్తులు దొరికేవి. కానీ ఇటీవలే బిగ్‌బజార్, రిలయన్స్ లాంటి సంస్థలతోనూ ఒప్పందం చేసుకోవడంతో వాటి స్టోర్లలోనూ పతంజలి ఉత్పత్తులు అందుబాటులోకి వచ్చాయి. తద్వారా ఈ ఏడాది వాటి అమ్మకాల విలువ రూ.20వేల కోట్లు దాటుతుందని అంచనా.

## అంకెల్లో పతంజలి

**రూ. 10,561 కోట్లు:** గత ఆర్థిక సంవత్సరంలో పతంజలి ఆదాయం

**47000:** దేశవ్యాప్తంగా ఉన్న పతంజలి రిటైల్ స్టోర్లు

**1000+ :** సంస్థ ఉత్పత్తుల సంఖ్య

**1500+ :** సంస్థకి మూడిసరుకుని అందిస్తున్న రైతులు

**1000 ఎకరాలు:** హరిద్వార్‌లోని పతంజలి ప్రధాన కార్యాలయ ప్రాంగణ వైశాల్యం

**200:** కొత్త ఉత్పత్తుల తయారీ కోసం పరిశోధనలు చేసే శాస్త్రవేత్తల సంఖ్య

**30:** హరిద్వార్‌లో పతంజలి ప్రాంగణంలో ఉన్న ఫ్యాక్టరీలు

**10:** పతంజలి ఉత్పత్తులు ఎగుమతి అవుతున్న దేశాలు

ఆ సంస్థ అమ్మకాలు ఊపందుకోవడానికి ఇది మూడో కారణం.

### బాబా బ్రాండ్

మొదట్నుంచీ పతంజలికి స్టార్ అంబాసిడర్ బాబా రామ్‌దేవే. తమ ఉత్పత్తుల ప్రచారం కోసం ఏ ప్రముఖుడికీ పైసా చెల్లించేది లేదని ఆయన చాలాసార్లు అన్నారు. తొంభై శాతం టీవీ ప్రకటనల్లో ఆయనే కనిపిస్తూ పతంజలికి ప్రచారం చేశారు. హేమామాలిని, సుశీల్ కుమార్ లాంటి ప్రముఖులు ఆ సంస్థ ప్రకటనల్లో కనిపించినా, దానికోసం వాళ్లు డబ్బులు తీసుకోలేదనీ, తమపైన ఉన్న నమ్మకంతో ఉచితంగా ప్రచారం చేశారన్నది రామ్‌దేవ్ మాట. యోగా గురువుగా ఆయనకున్న గుర్తింపు వినియోగదార్లను సులువుగానే ఆకర్షించింది. అన్ని రకాల ప్రకటనల్లో ఆయన కనిపించడం, వాటికి తోడు యోగా శిక్షణతో టీవీ కార్యక్రమాల్లో, సామాజిక ఉద్యమకారుడిగా వార్తల్లో తరచూ ప్రజల ముందుకు రావడంతో ఆయన్ని గుర్తించే వారి సంఖ్య పెరిగింది. ఆ ఫలితం బ్రాండ్ వాల్యూ పెరగడానికి సాయపడింది. పతంజలి విజయానికి రామ్‌దేవ్ ప్రచారం నాలుగో కారణం.

### తిరుగులేని వ్యూహాలు...

దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలన్న సిద్ధాంతాన్ని పతంజలి తూ.చ. తప్పకుండా ఆచరిస్తోంది. అందుకే మార్కెట్లో ఒక ఉత్పత్తి బావుందన్న పేరు రాగానే వెంటనే మరో ఉత్పత్తిని తీసుకొస్తోంది. సబ్బులూ, షాంపులూ, పేస్టులూ, టాయిలెట్ క్లీనర్లూ, నిత్యావసరాలూ, పిల్లల ఆహారం... ఇలా ఐదేళ్లలో యాభై నుంచి ఏకంగా వెయ్యికి పైగా ఉత్పత్తులను తీసుకొచ్చే స్థాయికి పతంజలి విస్తరించింది. ప్రత్యేక స్టోర్లు ఉండటంతో ఒక వస్తువు కొనడానికి వచ్చేవాళ్లు నాలుగైదు వస్తువుల్ని కొనుగోలు చేసే అవకాశం ఉండటం కూడా అమ్మకాలకు ఊతమిస్తోంది. ఎదగడానికి వచ్చిన ఏ అవకాశాన్నీ పతంజలి వదిలిపెట్టలేదు. గతంలో హానికారక రసాయనాలు ఉన్నాయంటూ ఓ సంస్థ నూడుల్స్ నిషేధానికి గురైన వెంటనే పతంజలి రంగంలోకి దిగింది. తమ నూడుల్స్ పూర్తిగా సహజ సిద్ధ పదార్థాలతో తయారయ్యాయని విస్తృతంగా ప్రచారం చేస్తూ 'పతంజలి నూడుల్స్'ని విడుదల చేసి వేగంగా వినియోగదార్ల ఆదరణ పొందడంలో సఫలమైంది. ప్రత్యేక స్టోర్లూ, అతి వేగంగా దూసుకొస్తున్న ఉత్పత్తుల సంఖ్యా, సందర్భానికి తగ్గ మార్కెటింగ్ వ్యూహాలూ... సంస్థ ఎదుగుదలకు ఐదో కారణం ఈ అంశాలే. ఈ ఐదు సూత్రాలూ పతంజలికి పంచ ప్రాణాలుగా మారి అతి తక్కువ కాలంలో దేశ మార్కెట్లో సంచలనాలు సృష్టించే దిశగా నడిపించాయి.

లక్ష కోట్లు... రాబోయే 5-10ఏళ్ల కాలానికి అమ్మకాల పరంగా రామ్‌దేవ్, బాలకృష్ణలు పెట్టుకున్న లక్ష్యమిది. మొత్తంగా దేశంలో ఏటా అమ్ముడయ్యే 'ప్యాకేజ్డ్ ప్రొడక్ట్స్' విలువలో ఇది మూడో వంతు. ఇప్పటివరకూ ఏ సంస్థకూ ఈ టర్నోవర్ సాధ్యం కాలేదనీ, ఈ లక్ష్యం ఆకాశానికి నిచ్చెన వేయడం లాంటిదేననీ అంటారు కొందరు మార్కెట్ నిపుణులు. పోటీ సంస్థలకంటే ఎన్నో రెట్లు ఎక్కువ వృద్ధిని ఏటా పతంజలి నమోదు చేస్తోందనీ, ఇదే వేగం కొనసాగితే ఆ లక్ష్యాన్ని అందుకోవడం పెద్ద కష్టం కాదనీ అంటారు ఇంకొందరు విశ్లేషకులు. ఎవరేమన్నా ఇటీవలి కాలంలో ఏ సంస్థకూ సాధ్యం కాని రీతిలో పతంజలి దూసుకెళ్తోందన్నది అక్షర సత్యం. పదేళ్ల క్రితం పైసా ఆస్తిలేని బాలకృష్ణ ఇప్పుడు అపర కుబేరుడిగా ఎదగడమే అందుకు సాక్ష్యం. ఆదాయపరంగా గతేడాది పతంజలి 1011శాతం వార్షిక వృద్ధిని సాధిస్తే, రెండో స్థానంలో ఉన్న మరో సంస్థ 80శాతం వృద్ధిని మాత్రమే నమోదు చేసింది. ఆ అంతరం చాలు మార్కెట్లో పతంజలి దూకుడేంటో చూపడానికి.

ఎమ్మెన్సీల ప్రాబల్యం తగ్గించి దేశానికి సేవ చేయడానికి వ్యాపారం, రైతులకు మేలు చేయడానికి ఆయుర్వేద సంస్థ, వినియోగదార్ల మంచి కోసం భిన్నమైన ఉత్పత్తులూ, పేదల కోసం ఖర్చుచేయడానికి లాభాలూ... ఈ నాలుగు నినాదాలనే వ్యాపార విధానాలుగా మార్చుకొని 'పతంజలి' అంతకంతకూ ఎదుగుతోంది. ఆ విధానాలు దారి తప్పనంత వరకూ సంస్థ ఎదుగుదలకు ఎలాంటి ఢోకా ఉండకపోవచ్చు..! ★



మనిషి జీవితంలో కానుకలది అపురూపమైన స్థానం. మనస్ఫూర్తిగా ఇచ్చే కానుక వెల అమూల్యం. అందుకే మన ప్రధాని మోదీ ఏ దేశానికి వెళ్లినా ఆ దేశాధ్యక్షుల కోసం ఏరి కోరి ప్రత్యేకమైన కానుకలు తీసుకెళ్తారు. రెండు దేశాల సంస్కృతీ సంబంధాలను ప్రతిబింబించేలా ఉంటాయి ఆ కానుకలు. అలాగే విదేశీ పర్యటనలకు వెళ్లిన మన దేశ ప్రముఖులకూ అద్భుతమైన కానుకలు లభిస్తుంటాయి. అవన్నీ ఏం చేస్తారో తెలుసా?







# రెండు డిన్నర్ సెట్లు, ఒక వాచీ మోదీ తీసుకెళ్లారు!

'ఈ వాచీ నేను టెంత్ ఫస్ట్‌క్లాస్‌లో పాసైనప్పుడు మా నాన్న కొనిచ్చారు...'

'వ్యాసరచనలో స్కూల్ ఫస్ట్ వచ్చినప్పుడు మా ప్రిన్సిపాల్ ఇచ్చిన పెన్ ఇది...'

ఈ మాటలు చెప్పేవారి మొహం ఆనాటి జ్ఞాపకాలతో ఎలా వెలిగిపోతుంటుందో ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. బహుమతులన్నీ మనసుని మధురస్మృతుల్లోకి తీసుకెళ్తాయి కాబట్టే వాటికి వెలకట్టలేం.

## జ్ఞాపకాల ఖజానా

తోషాఖానా... ఈ పదానికి అర్థం 'ఖజానా'. ఒకప్పుడు యువరాజులూ రాకుమారులూ ప్రతిభాపాటవాలు ప్రదర్శించినప్పుడు లభించిన బహుమతులనూ విదేశాలు సందర్శించినప్పుడు అక్కడి వారు గౌరవంతో ఇచ్చిన కానుకలనూ ఈ తోషాఖానాలో భద్రపరిచేవారు. అతిథులు వచ్చినపుడు వారికి దీనిని చూపించడం రాకుమారుల హోదాకు చిహ్నంగా ఉండేది. రాజులూ రాజ్యాలూ పోయినా పలు దేశాల ప్రభుత్వాలు ఇప్పటికీ ఈ సంప్రదాయాన్ని కొనసాగిస్తున్నాయి.

మన దేశంలో బ్రిటిష్ పాలకులు ఉన్నప్పుడే తోషాఖానా ప్రారంభమైంది. ఈస్టిండియా కంపెనీ అధికారులు నియమం ప్రకారం తమకు వచ్చిన కానుకలను తోషాఖానాలో జమ చేసేవారు. మళ్లీ ఎవరికైనా బహుమతి ఇవ్వాలనుకున్నప్పుడు వీటిల్లోనుంచే ఎంచుకుని ఇచ్చేవారు.

విదేశీ వ్యవహారాల మంత్రిత్వ శాఖ ఆధ్వర్యంలో ఇప్పటి మన ప్రభుత్వ తోషాఖానా నడుస్తోంది. మంత్రులూ ఉన్నతాధికారులూ విదేశీ పర్యటనలకు వెళ్లినప్పుడు తమకు వచ్చిన కానుకలను ఇక్కడ జమ చేయాలి. ప్రతి వస్తువుకీ తోషాఖానా అధికారులు విలువ కడతారు. నియమం ప్రకారం రూ.5వేల కన్నా తక్కువ విలువగల కానుకలను గ్రహీతలు ఇళ్లకు తీసుకెళ్లవచ్చు. ఐదు వేల కన్నా ఎక్కువ విలువ గల కానుకలను తీసుకెళ్లాలనుకుంటే మాత్రం ఎంత ఎక్కువుంటే అంత తోషాఖానాకు చెల్లించి తీసుకెళ్లవచ్చు. ఇళ్లకు తీసుకెళ్లని కానుకలన్నీ ఈ తోషాఖానాలోనే ఉండిపోతాయి. వెయ్యి రూపాయల ఖరీదుచేసే టిష్యూ బాక్స్‌తో మొదలుపెట్టి లక్షల ఖరీదైన రోలెక్స్ వాచీల వరకూ ఇక్కడ ఉన్నాయి. ఎక్కువగా కళాఖండాలూ, పెయింటింగులూ ఉంటాయి.

## మోదీ మెచ్చిన గడియారం

ప్రధాని మోదీకి ఈ మధ్య కాలంలో లభించిన కానుకలలో ఆయనకు బాగా నచ్చింది 'హౌస్ ఆఫ్ కామన్స్' కాన్సెప్ట్‌తో బ్రిటిష్ కంపెనీ 'సెకొండ' తయారుచేసిన ఓ రిస్ట్ వాచీ. దాని విలువ రూ.3500 మాత్రమే కావడంతో దాన్నీ రూ.వెయ్యి విలువ గల ఓ పింగాణీ అలంకరణ వస్తువునీ ఆయన ఇంటికి తీసుకెళ్లారు. ఈ మధ్య కాలంలో తోషాఖానాలో 83 వస్తువులు జమ అయ్యాయి. తోషాఖానా రికార్డుల ప్రకారం మోదీ డబ్బు కట్టి మరీ ఇంటికి తీసుకెళ్లిన బహుమతులు ఏమిటంటే... రూ.10వేల విలువ గల రెండు డిన్నర్ సెట్లు, రూ.15 వేలు విలువ గల ఒక తివాచీ. గత ఏడాది మోదీకి లభించిన కానుకల్లో చెప్పుకోదగ్గవి రూ.1,80,000 విలువ గల సీకో ఆస్ట్రాన్ వాచ్, నగిషీలు చెక్కిన చైనా పింగాణీ పాత్ర, 'వన్ లా అండ్ కాన్‌స్టిట్యూషన్' పేరున్న రెండు పుస్తకాలు.

పదేళ్ల పాటు ప్రధానిగా ఉన్న మన్మోహన్ సింగ్ తనకు వచ్చిన పలు కానుకలనుంచి 101 వస్తువులను మాత్రమే ఇంటికి తీసుకెళ్లారు. వాటిల్లో 10 పెయింటింగ్స్, నగిషీలు చెక్కిన వెండి ఏనుగు, బోస్ సౌండ్ సిస్టమ్, పిజెట్ గోల్డ్ ప్లేటెడ్ లేడీస్ రిస్ట్‌వాచ్ ఉన్నాయి. ఆయన తీసుకెళ్లిన కానుకల్లో ఐదు వేలకన్నా ఎక్కువ విలువైనవి ఏడు మాత్రమే.

విదేశాంగ మంత్రి సుష్మాస్వరాజ్ తనకు వచ్చిన బహుమతులన్నీ తోషాఖానాకే అప్పజెబుతారు. తరచుగా విదేశీ ప్రయాణాలు చేసే ఆ శాఖ సహాయమంత్రి ఎంజె అక్బర్‌కి ఎక్కువగా కానుకలు వస్తాయి కానీ ఆయన కొన్ని అలంకరణ వస్తువుల్ని మాత్రమే ఇంటికి తీసుకెళ్లారు. మంత్రి నిర్మలా సీతారామన్ కూడా తనకు వచ్చిన కానుకలన్నీ తోషాఖానాకే అప్పగిస్తారు. ప్రధాని దగ్గర సంయుక్త కార్యదర్శిగా పనిచేస్తున్న వినయ్ కవాత్రా అత్యంత ఖరీదైన (రూ.1,60,000) రోలెక్స్ ఆయిస్టర్ వాచీని కూడా తోషాఖానాకే అందజేశారు. మరో అధికారి సుబ్బరాయుడు తనకు కానుకగా వచ్చిన ఆపిల్ ఐపాడ్ ఎయిర్‌ని ఇంటికి తీసుకెళ్లడానికి రూ.37వేలు చెల్లించాల్సి వచ్చింది. మంత్రులైనా అధికారులైనా అరుదుగా మాత్రమే విలువైన వస్తువులను ఇళ్లకు తీసుకెళతారు.

ఈ కానుకలు ఒకసారి తోషాఖానాలో జమ అయిన తర్వాత అవి ఎక్కడినుంచి వచ్చాయన్న విషయాన్ని అధికారులు బహిర్గతపరచరు. ఆయా దేశాలతో ద్వైపాక్షిక సంబంధాల మీద ప్రభావం పడకూడదన్న కారణంతోనే ఈ నియమాన్ని పాటిస్తారు. ప్రతి మూడు నెలలకోసారి మొత్తం జమ అయిన వస్తువుల జాబితాను విదేశాంగ మంత్రిత్వ శాఖ వెబ్‌సైట్‌లో అప్‌లోడ్ చేస్తారు. ★



ఎంసీఏ చదవడానికి హైదరాబాద్‌లో అడుగుపెట్టిన ఆ కుర్రాడు చదువుకి మధ్యలోనే ఫుల్‌స్టాప్ పెట్టాడు. సినిమాల్లోకి వెళ్లి దర్శకుడయ్యాడు. 'అందాల రాక్షసి'తో అందరి ప్రశంసలూ అందుకొని 'కృష్ణగాడి వీర ప్రేమగాథ'తో హిట్ కొట్టేశాడు. తాజాగా 'లై'తో మరో హిట్ అందుకున్న ఆ యువ దర్శకుడు హను... హనుమంతరావు రాఘవపూడి. సినిమా సినిమాతో కెరీర్‌లో పైపైకి వెళ్తున్న హను తన జర్నీ గురించి చెబుతున్నాడిలా...




# అందుకే... ఉద్యోగం అంటే భయం!

చిన్నప్పట్నుంచీ చదువులో ముందుండే వాణ్ని, 80-90 శాతం మార్కులు వచ్చేవి. అమ్మ సూర్యకుమారి, జ్యుడీషియల్ డిపార్ట్‌మెంట్‌లో, నాన్న సన్యాసిరావు, సింగరేణి కాలరీస్‌లో ఉద్యోగాలు చేసేవారు. నేను పుట్టింది సత్తుపల్లిలో. పెరిగిందంతా కొత్తగూడెంలో. చదువుకున్నదీ అక్కడే. అమ్మానాన్న ఇద్దరూ ఉద్యోగులే కావడంవల్ల స్కూల్ నుంచి ఇంటికి వచ్చేసరికి తలుపులు వేసి ఉండేవి. అన్నయ్య, నేను, తమ్ముడు... తాళాలు తీసి మా పనులు మేమే చేసుకునే వాళ్లం. మా తిండి మేమే పెట్టుకొని తినే వాళ్లం. అప్పుడే ఉద్యోగం అంటే ఒకరకమైన విరక్తి వచ్చింది. ఒక చోట కూర్చొని చేసే పనిమీద అనాసక్తి ఏర్పడింది. డిగ్రీ తర్వాత ఎంసీఏ చేయడానికి హైదరాబాద్ వచ్చాను. దిల్‌సుఖ్‌నగర్‌లో ఉంటూ కాలేజీకి వెళ్లేవాణ్ని. కానీ ఏదో అసంతృప్తి. మాది మధ్య తరగతి కుటుంబం. పుస్తకాలే తిండి పెడతాయి అన్నట్టు పెంచారు. ఎంసీఏ చదువుతున్నానే కానీ, రోజులు గడుస్తున్నకొద్దీ ఉద్యోగం చేయాల్సి వస్తుందనే భయం పట్టుకుంది. బాగా ఆలోచించి సెకండ్ ఇయర్‌కి వచ్చాక ఇక చదవలేనని అమ్మానాన్నలకి చెప్పాను. 'మరేం చేస్తావ'న్న వాళ్ల ప్రశ్నకు సమాధానం లేదపుడు. అన్నయ్య మాత్రం 'ఏం చేస్తావో నువ్వే నిర్ణయించుకొని చెప్పు' అన్నాడు.

## 'అమృత' ఘడియలు

చిన్నప్పట్నుంచీ వేదం, పురాణాలూ, ఇతిహాసాలూ చదివించేవారు నాన్న. ఆపైన తెలుగు సాహిత్యం చదవడమూ అలవాటైంది. కాలేజీకి వచ్చేసరికి పాటలూ, పద్యాలూ, చిన్న కథలూ రాసేవాణ్ని.

ఫ్రెండ్స్‌లో ఒకరు 'జూబ్లీహిల్స్‌లో సినిమా వాళ్లు ఉంటారు. ఓసారి వెళ్లి ప్రయత్నించి చూడు'అని చెబితే వెళ్లాను. జూబ్లీహిల్స్ చెక్‌పోస్ట్ సమీపంలో ఓ ఇంటి దగ్గర షూటింగ్ హడావుడి ఉంది. వెళ్లి చూశాను. 'అమృతం' సీరియల్ తీస్తున్నారక్కడ. నాకెవరూ తెలీదు. చంద్రశేఖర్ ఏలేటి గారు అందరికీ అన్నీ చెబుతుంటే వెళ్లి కలిసి, 'ఎంసీఏ చదువుకుంటున్నాను, సినిమా అంటే ఆసక్తి' అని ఇంకా నా గురించి చెప్పాను. ఆయన డైరెక్టర్ కాబట్టి నేను డైరెక్షన్ డిపార్ట్‌మెంట్‌లో చేరడానికి వచ్చాననుకున్నారు. 'ఇంట్లోవాళ్లు ఏం అనరా' అని అడిగారు. మరో రెండేళ్లు చదివినా డబ్బు, సమయం వృథా అనిపిస్తున్నాయని ఇంట్లోనూ చెప్పానన్నాను. 'కథలు రాశాను అంటున్నావు, ఏవైనా ఆలోచనలు ఉంటే చెప్పు. రెండ్రోజుల తర్వాత కనిపించు' అన్నారు. తర్వాత వెళ్లి నా దగ్గరున్న మూడు ఆలోచనల్ని చెబితే బావున్నాయన్నారు. 'నీకు ఇక్కడ భవిష్యత్తు ఉంటుంది. కానీ ఎంత సీరియస్‌గా పనిచేస్తావనేదానిపైనే విజయావకాశాలు ఉంటాయి' అని చెప్పారు. అలా 2001లో అమృతం సీరియల్‌కి అసిస్టెంట్ డైరెక్టర్‌గా కుదిరాను. ఆ సీరియల్‌కి చందూ గారు పది ఎపిసోడ్లు డైరెక్షన్ చేశారు. రమా రాజమౌళి కూడా అప్పుడక్కడ అసిస్టెంట్ డైరెక్టర్. చందూతో ప్రత్యక్షంగా పనిచేస్తూ నేర్చుకుంటూనే గున్నం గంగరాజు, రాజమౌళి గార్ల పనితీరుని పరోక్షంగా చూశాను. గంగరాజు గారితో పది నిమిషాలు మాట్లాడితే ఏదో ఒకటి కొత్తగా తెలుసుకుంటాం. కొత్తవాణ్నయినా అందరూ ప్రోత్సహించేవారు.

## సినిమాలే సినిమాలు

అమృతం తర్వాత చందు గారి దగ్గర 'ఐతే', 'అనుకోకుండా ఒక రోజు' సినిమాలకి అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేశాను. ఓరోజు మాటల్లో 'సినిమాలకు పనిచేసినంత మాత్రాన డైరెక్టర్ కాలేవు. వేరే సినిమాలూ చూస్తుండు' అని సలహా ఇచ్చారు చందూ. అప్పటివరకూ థియేటర్లలో రిలీజయ్యే సినిమాల్నే చూసే వాణ్ని. కానీ అసలైన సినిమా ప్రపంచం తెలీదు. చందూ దగ్గర చాలా పెద్ద డీవీడీ కలెక్షన్ ఉండేది. వాటిలోంచి కొన్ని తీసుకొని రోజూ మూడేసి సినిమాలు చూసేవాణ్ని. అవి చూశాక ఈ సినిమా ప్రపంచంలో నా స్థానం ఎక్కడో అర్థమైంది. ఎన్నో గొప్ప సినిమాలు. కనీసం వాటి పేర్లు కూడా తెలీదే! 'శంకరాభరణం', 'రోజా' నాకు బాగా నచ్చిన సినిమాలు. వాటిని ఎన్నిసార్లు చూశానో నాకే తెలీదు. ఇంకా మిగతా హీరోల సినిమాల్నీ చూసేవాణ్ని. కానీ ఇరాన్, కొరియా, జపాన్, హాలీవుడ్ సినిమాల్ని చూడ్డం మొదలుపెట్టాక సినిమా లోతు తెలిసింది. అప్పుడే చెన్నైలో మంచి డీవీడీలు దొరుకుతాయంటే నేను దాచుకున్నవీ, అన్నయ్య ఇచ్చినవీ కలిపి రూ.20వేలు పట్టుకెళ్లాను. అక్కడ రకరకాల డీవీడీల్ని చూస్తుంటే సినిమాలు తీయడం కాదు, వాటిని చూస్తూనే బతికేయొచ్చనుకున్నా. అదే సమయంలో అంత పెద్ద సముద్రంలో నేనెక్కడన్న ప్రశ్న మొదలైంది. నా ఆత్మవిశ్వాసం పాతాళానికి పడిపోయింది. తర్వాత కూడా చెన్నై వెళ్లి డీవీడీలు కొని తెచ్చేవాణ్ని. ఇదంతా అయ్యేసరికి చందూగారి మూడో సినిమా 'ఒక్కడున్నాడు' వరకూ వచ్చేశాం. నాతోపాటు ఆయన దగ్గర అసిస్టెంట్‌లుగా పనిచేసే రాధాకృష్ణ, సుధీర్... మణికొండలో అపార్ట్‌మెంట్ అద్దెకు తీసుకొని ఉండేవాళ్లం. హోమ్ థియేటర్ ఒకటి కొనుక్కొని అందులో సినిమాలు చూసేవాళ్లం. బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా వాటితోనే కొన్ని నెలలు గడిపేవాళ్లం. నచ్చిన సినిమాల్ని రకరకాలుగా చూసేవాళ్లం. సౌండ్ వింటూ విజువల్స్ ఊహిస్తూ, మ్యూట్‌లో పెట్టి విజువల్స్ గమనిస్తూ నోట్సు రాసుకునే వాళ్లం. అవే మాకు పాఠాలయ్యాయి.

## షార్ట్‌ఫిల్మ్‌తో ఫేమస్

చందూగారి దగ్గర 'ఒక్కడున్నాడు'కి అసిస్టెంట్‌గా పనిచేస్తున్నపుడే 2005-06 ప్రాంతంలో 'ఐ యామ్ ఫేమస్' పేరుతో షార్ట్‌ఫిల్మ్ తీశాను. ఎయిడ్స్ బాధితురాలైన ఓ చిన్నారి కథ అది. మొదటి ప్రయత్నం కాబట్టి ఎక్కడా రాజీలేకుండా తీయాలనుకున్నాను. సముద్రం, చర్చి, స్కూల్... రకరకాల లొకేషన్లు చూసుకున్నాను. అప్పటికి డిజిటల్ కెమెరాలు ఇంకా రాలేదు. కెమెరామేన్ సెంథిల్ ఫ్రీగా నెగెటివ్ రీల్ సమకూర్చారు. రమా రాజమౌళి గారు లక్షాయాభై వేలు ఇచ్చారు. ప్రసాద్ ల్యాబ్ వాళ్లు ఎడిటింగ్‌కు సాయం చేశారు. మరి కొందరు స్నేహితులు డబ్బు పెట్టారు. అప్పట్లో దానికి రూ.3.5 లక్షలు ఖర్చయింది. దానికి మంచి గుర్తింపు వచ్చింది. రాజమౌళి గారు కూడా ఆ షార్ట్‌ఫిల్మ్ చూసి మెచ్చుకున్నారు. చందు దగ్గర హను అనే మంచి అసిస్టెంట్ డైరెక్టర్ ఉన్నాడనే గుర్తింపు వచ్చింది. ఆ సమయంలో చందూ చెబితే నిర్మాత ఎం.ఎస్.రాజుగారిని కలిశాను. మామధ్య కథా చర్చలు జరిగాయి. అప్పటికి నాకు 26-27 ఏళ్లు. అది వర్కవుట్ కాలేదు. కానీ ఆయనతో ఇప్పటికీ మంచి అనుబంధం ఉంది.

## మొదటి సినిమా

చందూగారితో 'ప్రయాణం' షూటింగ్ చివరకు వచ్చిన దశలో సినిమా చేద్దామని ఒక కథ రాశా. నా స్నేహితుడు సుధీర్ నిర్మాతగా ఉంటానన్నాడు. క్రైమ్ కామెడీ, మంచి కథ. కానీ బడ్జెట్ ఎక్కువవుతుందని ఆపేశాం. తర్వాత తక్కువ బడ్జెట్‌లో ఒక ప్రేమకథ తీయాలనుకున్నాను. అదే 'అందాల రాక్షసి'. సూర్యచంద్రులు పురుషులై, భూమి స్త్రీ అయితే, వారి మధ్యలో ప్రేమ పుడితే ఎలా ఉంటుందని ఊహించి కాలేజీ రోజుల్లో కథ రాసుకున్నాను. దాని ఆధారంగా సినిమా కథ అల్లుకున్నాను. సుధీర్ నిర్మాతగా సినిమా మొదలు పెట్టాం. సాయి కొర్రపాటి, రాజమౌళి తర్వాత ఆ సినిమాకి నిర్మాతలుగా ఉన్నారు. నాతోపాటు నటీనటులకీ, టెక్నీషియన్లకీ, అసిస్టెంట్ డైరెక్టర్లకీ అదే మొదటి సినిమా. చాలా కష్టపడ్డాం. కథ పరంగా మంచి హిట్. కానీ డబ్బులు రాలేదు. ఇప్పటికీ వారంలో ఒకసారైనా ఆ సినిమా గురించి ఎవరో ఒకరు మాట్లాడతారు. ఆ సినిమా తర్వాత మూడేళ్లు చాలా కథలు రాశాను. నా దృష్టిలో ఒక కథ రాసుకున్నానంటే, ఆ సినిమా తీసేసినట్టే, అంతలా సిద్ధం చేసుకుంటాను.

## నానీ వల్లనే

నిజానికి 'అందాల రాక్షసి' కథ మొదట నానీకి చెప్పాను. తనకీ నచ్చింది కానీ, ఎందుకో చేయలేదు. అప్పట్నుంచీ మా మధ్య ఓ అనుబంధం ఉంది. 'కృష్ణగాడి వీర ప్రేమ గాథ' కథని నానీకి వినిపించాను. తను ఓకే అన్నాక 14రీల్స్ నిర్మాణానికి ముందుకొచ్చింది. మా సినిమా ఓకే అనుకున్నాక నానీవి 'భలేభలే మగాడివోయ్', 'ఎవడే సుబ్రమణ్యం' వచ్చాయి. రెండూ హిట్ అయ్యాయి. మాది చాలా భిన్నమైన కథ. కత్తి అంటే భయపడే వాడు రావణుడి లాంటి వ్యక్తి చెల్లినే ప్రేమిస్తాడు. చివరకు వాడెలా విజయం సాధిస్తాడనేదే కథ. నానీ నటన కథని ఎక్కడికో తీసుకెళ్లిపోయింది. మా సినిమా కూడా హిట్ అయింది. పరిశ్రమలో చాలామందిని చూశాను కానీ నానీ ఎంతో ప్రత్యేకం. నటుడిగా హిట్, ఫ్లాప్‌ల దశ దాటేశాడు. ఆ సినిమా సక్సెస్ తర్వాత నాకు పెళ్లయింది. జీవితం ఒక గాడిలో పడింది. నానీకే ఆ క్రెడిట్ దక్కుతుంది.

## అమెరికాలో 'లై'

సినిమాకి సెట్ వేయడం నాకు నచ్చదు. నా కథలు వాస్తవానికి దగ్గరగా ఉంటాయి. ముఖ్యమైన సీన్లు బయటి వాతావరణంలోనే జరుగుతాయి. సెట్‌లో సీన్లు తీస్తే ఏదో కృతకంగా ఉంటుంది. అందుకే 'లై' సినిమాని అమెరికాలో నిజమైన లొకేషన్లలో తీశాం. అదో సాహసోపేత జర్నీ. సినిమాలో 80 శాతం అమెరికాలోనే షూట్ చేశాం. ఈ ఏడాది ఏప్రిల్‌లో అక్కడికి వెళ్లాం. 75 రోజుల షూటింగ్. రోజూ 20 గంటలు పనిచేశాం. ఓసారి విరామం లేకుండా పూర్తిగా మూడు రోజులు షూటింగ్ స్పాట్‌లోనే ఉండిపోయాం. మరోసారి మైనస్ ఎనిమిది డిగ్రీల సెల్సియస్‌లో పనిచేశాం. అసిస్టెంట్ డైరెక్టర్‌కీ, ఆర్ట్ డైరెక్టర్‌కీ వీసాలు రాలేదు. అయినా కష్టపడ్డాం. సినిమాకి వచ్చిన స్పందనతో ఇప్పుడు హ్యాపీగా ఫీలవుతున్నా. ఒక మంచి ఇంగ్లిష్ సినిమా తెలుగు కథతో చూసినట్లు ఉంటుంది. ఈ సినిమాతో నితిన్ రూపంలో నాకు మరో మంచి మిత్రుడు దొరికాడు. సినిమా పరంగానే కాదు, వ్యక్తిగతంగానూ క్లోజ్ అయ్యాం. మేం 'సర్' అని పిలుచుకోవడం దగ్గర మొదలుపెట్టి 'అరె', 'ఒరె' అన్నంత క్లోజ్ అయిపోయాం. హీరోయిన్ మేఘా ఆకాశ్ నన్ను 'అన్నయ్యా' అని పిలిచేది. ఈ సినిమాతో నాకో చెల్లెలు కూడా దొరికింది. ఎడిటర్ శేఖర్, సినిమాటోగ్రఫర్ యువరాజ్- అందరం ఒక కుటుంబం అయిపోయాం.

'లై' షూటింగ్ సమయంలో ఎన్నో ఎత్తుపల్లాల్ని చూశాం. సినిమా తీయడానికి ముందే 45రోజులపాటు అమెరికాలో ఉండి లొకేషన్లు చూసుకున్నాం. దాంతో అప్పుడే సినిమాని నేనూ, అసిస్టెంట్ డైరెక్టర్ యువరాజ్ చూసినట్టనిపించింది. నిర్మాతలు కూడా బాగా మద్దతు ఇచ్చారు. ఈ సినిమాకి ఒక సంగీత విద్వాంసుడు కావాలనుకున్నాను. అలాంటివారిలో నేను అందుకోగలిగినవారిలో మణిశర్మ కనిపించారు. ఆయనీ సినిమాకి ప్రాణం పెట్టారు. 'లై'ని ఎప్పటికీ మర్చిపోలేను. ఎందుకంటే ఈ సినిమా రిలీజ్‌కి మూడ్రోజులు ముందు మాకు అబ్బాయి పుట్టాడు. నా భార్య అమూల్య... డాక్టర్. మాది పెద్దలు కుదిర్చిన సంబంధమే. తను నన్ను ఎంతో అర్థం చేసుకోబట్టే 'లై'ని విజయవంతంగా పూర్తిచేశాను. 'లై' సక్సెస్ అమూల్యకే చెందుతుంది. ఎందుకంటే నేను దగ్గర లేకపోయినా అర్థం చేసుకోగలిగింది. సినిమాకీ సినిమాకీ మధ్య ఖాళీ దొరికితే సినిమాలు చూస్తాను. ప్రస్తుతం అదే పనిలో ఉన్నాను. మరో పక్క బాబుని చూసుకుంటున్నా! ★

### ఇంకొంత

అమ్మ వాళ్లది రాజమండ్రి, నాన్నది విజయనగరం. పెళ్లయ్యాక ఇద్దరూ కొత్తగూడెంలో స్థిరపడ్డారు. ప్రస్తుతం హైదరాబాద్‌లో మాతో ఉంటున్నారు.

★ అన్నయ్య సీతారామప్రసాద్ శర్మ డెలాయిట్‌లో పని చేస్తున్నాడు. తమ్ముడు ప్రకాశం అమెరికాలో ఉద్యోగం చేస్తున్నాడు. అన్నయ్య అంటే ఇప్పటికీ భయం. తనే నా ధైర్యం కూడా. ఇప్పటికీ గైడెన్స్ ఇస్తాడు. నా సక్సెస్‌లో సగం పాత్ర ఆయనదే!

★ సినిమాల్లోకి వచ్చాక రాధాకృష్ణ, సుధీర్, ఎస్సార్ శేఖర్ మంచి స్నేహితులయ్యారు.

★ పెళ్లి అయ్యాక అమూల్యమీద డిపెండ్ అవడం మొదలుపెట్టాను.

★ గతేడాది ఆగస్టు 27న పెళ్లయింది. ఈ ఆగస్టు 8న అబ్బాయి పుట్టాడు.

★ చంద్రశేఖర్ ఏలేటి లేకపోతే నేను లేను. సినిమాలపరంగా ఆయన గైడెన్స్ ఎప్పటికీ తీసుకుంటాను.



# మార్స్ మీద కాలనీ కట్టేస్తాం...

**రెండు రోబోలు మాట్లాడుకున్నాయి. శాస్త్రవేత్తలు వాటికి నేర్పిన భాషలో కాదు! పైగా వారి ఆదేశాలను అవి పెడచెవిన పెట్టాయి. దాంతో బెంబేలెత్తిన శాస్త్రవేత్తలు మొత్తానికి ఆ వ్యవస్థనే షట్‌డౌన్ చేశారు. ఫేస్‌బుక్ చేపట్టిన కృత్రిమ మేధస్సు (ఆర్టిఫిషియల్ ఇంటెలిజెన్స్) ప్రాజెక్టులో జరిగిన ఈ సంఘటనపై వార్తలు బయటకు రాగానే అందరూ 'ఎలాన్ మస్క్ చెప్పిందే నిజమైంది...' అన్నారు.**

**ఎవరీ ఎలాన్ మస్క్?**

**ఏం చెప్పారాయన?**

కృత్రిమ మేధస్సు... దీనిపై ప్రపంచ వ్యాప్తంగా ఎంతగా పరిశోధనలు జరుగుతున్నాయో అంతగా చర్చా జరుగుతోంది. ఫేస్‌బుక్ కార్యాలయంలో జరిగిన సంఘటనకు కొద్ది రోజులముందే కృత్రిమమేధపై పరిశోధనలకు నియంత్రణ, రక్షణ చర్యలు అవసరమన్న టెస్లా సీఈవో ఎలాన్ మస్క్ అభిప్రాయాన్ని జుకర్‌బర్గ్ ఖండించారు. ఇది అనవసరంగా భయపెట్టడమేనన్నారు. ట్విటర్‌లో వీరిద్దరి సంభాషణ తర్వాతే ఫేస్‌బుక్ కార్యాలయంలో రోబోలు మాట వినని సంఘటన జరిగింది.

ఇటీవల హైపర్‌లూప్ ట్రాన్స్‌పోర్టేషన్ టెక్నాలజీస్ సంస్థ వ్యవస్థాపకులు మన దేశంలో పర్యటించారు. వారితో భేటీ అయిన ఏపీ సీఎం చంద్రబాబునాయుడు ఏపీలో ఆ తరహా రవాణా వ్యవస్థ అవకాశాలను పరిశీలిస్తామన్నారు. ఈ హైపర్‌లూప్ అన్న ఆలోచనని మొదట ప్రకటించింది ఎలాన్ మస్క్. ఒకప్పుడు ఆయన ఏం మాట్లాడినా అందరూ అపనమ్మకంగా చూసినవారే. కానీ అవే ఒకటొకటిగా ఇప్పుడు నిజమవుతున్నాయి.

మనుషులు గ్రహాంతరయానం చేసే రోజుల్ని ఊహిస్తున్న మస్క్ మరో యాభై ఏళ్లలో అంగారక గ్రహం మీద పది లక్షల మందితో పూర్తి స్థాయి కాలనీ ఏర్పడుతుందనీ అలా వెళ్లకపోతే భూమిపైన మానవజాతి మనుగడ సాగించలేదనీ జోస్యం చెబుతారు. అంతేకాదు, 2023లో మార్స్‌కి ప్రయాణికులను పంపే ప్రణాళికనూ ఆయన సిద్ధం చేశారు. మార్స్‌కి ప్రయాణం ఎంత మజాగా ఉంటుందో ఆయన వర్ణించి చెబుతుంటే సైన్స్ ఫిక్షన్ సినిమా చూసినట్లే ఉంటుంది.

★ ఆఫ్రికాలో పుట్టి పెరిగి అమెరికాలో స్థిరపడిన ఎలాన్ మస్క్ వ్యాపారవేత్త, పెట్టుబడిదారు, ఇంజినీరు, ఆవిష్కర్త. ఎలక్ట్రిక్ కార్ల తయారీ సంస్థ టెస్లా వ్యవస్థాపకుడిగా, సీఈవో, చీఫ్ టెక్నాలజీ ఆఫీసరుగా ఆయన చాలా మందికి తెలుసు. అంతే కాదు, స్పేస్‌ఎక్స్ సంస్థ సహవ్యవస్థాపకుడు. ఓపెన్‌ఏఐ (కృత్రిమమేధపై పరిశోధన సంస్థ) కో ఛైర్మన్, పేపాల్, న్యూరలింక్ సహవ్యవస్థాపకుడు. సోలార్ సిటీ, జిప్ -2 ... ఇలా చాలా కంపెనీలతో ఆయనకు సంబంధం ఉంది. ప్రపంచ సంపన్నుల జాబితాలో తొలి వందమందిలో ఉంటారు.

★ ఒక్క వ్యక్తి ఇన్ని కంపెనీల బాధ్యతలు ఎలా చూసుకుంటారంటే... మస్క్ ఆరు గంటలే పడుకుంటారు. ఉదయం ఏడింటికి నిద్రలేచి స్నానం చేసి టిఫిన్ తినకుండానే ఆఫీసుకు బయల్దేరతారు. మధ్యలో టైం ఉందనుకుంటే ఒక ఆమ్లెట్ తిని కాఫీ తాగుతారు. సోమ, శుక్రవారాలు స్పేస్ ఎక్స్ కార్యాలయంలో, మధ్యలో మూడు రోజులూ టెస్లాలో పనిచేస్తారు. ఏదైనా సమావేశంలో మాట్లాడుతూనే మధ్యాహ్న భోజనం ఐదు నిమిషాల్లో పూర్తిచేస్తారు. ఫోన్ కాల్స్ అసలు తీసుకోరు. వారానికి 85 నుంచి 100 గంటలు పనిచేస్తారు. 80 శాతం పనిగంటలు ఆయనకు ఇష్టమైన ఇంజినీరింగ్, డిజైన్ పనుల్లోనే గడుపుతారు.

★ మస్క్ రెండు పెళ్లిళ్లూ విడాకులకు దారితీశాయి. మొదటి భార్య ద్వారా ఐదుగురు కుమారులు. వారాంతాల్లో వారితో గడుపుతారు. ఆ సమయంలోనూ ఈ మెయిల్స్ చూసుకోవడమో, మరో పనో కూడా చేస్తూనే ఉంటారు. ఒక్క పనే చేస్తే తనకు సమయం సరిపోదని చెప్తారు మల్టిటాస్కింగ్ నిపుణుడైన మస్క్.

★ వారాంతాలూ, రాత్రివేళ జరిగే బిజినెస్ డిన్నర్లు చాలు కడుపునిండా తినడానికి అంటారాయన. వారానికి రెండు మూడుసార్లు జిమ్‌కి వెళ్తారు. పుస్తక పఠనం అన్నా ఇష్టమే. ద లార్డ్ ఆఫ్ ద రింగ్స్ లాంటి పుస్తకాలూ, శాస్త్రవేత్తల జీవిత చరిత్రలు చదువుతారు.

★ ఈయనే ఇలా పనిచేస్తుంటే ఇక ఆయన దగ్గర పనిచేసేవారి పరిస్థితేంటి అంటారా? మస్క్ దగ్గర పనిచేయడమంటే సైన్యంలో ప్రత్యేక దళంలో పనిచేస్తున్నట్లేనట. ఇతరులు అసాధ్యమనుకున్నదే వారు చేస్తారు మరి. ఏ పనైనా ఫలానా సమయంలో, పరిమిత ఖర్చుతో సాధ్యంకాదని ఎవరైనా చెప్తే ఆయనకు ఇష్టం ఉండదు. అనుకున్న షెడ్యూలు ప్రకారం దాన్ని చేసి చూపించగలడాయన. పని అయ్యేవరకూ శని, ఆదివారాలు సైతం పనిచేయడం, ఆఫీసులో బల్లల మీదే నిద్రపోవడం... మామూలే.

★ ఇటీవలే టెస్లా మోడల్ 3 కారుని మార్కెట్లో ప్రవేశపెట్టారు. ఈ కారుకి 4 లక్షల అడ్వాన్సు రిజర్వేషన్లు ఉన్నాయి. వచ్చే ఏడాదికల్లా 5లక్షల కార్లను తయారు చేయాలన్నది సంస్థ లక్ష్యం. అయితే అందుకు సిబ్బంది ఐదు రెట్లు ఎక్కువగా పనిచేయాల్సి వస్తుంది.

★ వైఫల్యాన్ని ఒక అవకాశంగా భావిస్తారాయన. ఏదీ విఫలం కాలేదంటే అర్థం మనం సృజనాత్మకంగా ఆలోచించడం లేదని... అంటారు. భవిష్యత్తులో మానవాళి ఎదుర్కొనే సమస్యలేమిటో ఆలోచించి తదనుగుణంగా పనిచేయాలి కానీ డబ్బు సంపాదించడానికి తేలిక మార్గం వెదుక్కుని కాదు... అనే మస్క్ తన సంపదను అందుకే వినియోగిస్తానంటారు.

★ టెస్లా కంపెనీ ప్రకటనలు ఇవ్వదు. దీనిపై ఓ బాలిక ట్విటర్‌లో ఆయనకో సలహా ఇచ్చింది. ప్రజలనుంచి ప్రకటనలను ఆహ్వానిస్తే బాగుంటుంది కదా అని. ఆయన ఆ సలహా స్వీకరించడమే కాదు, వెంటనే పోటీ ప్రకటించారు. నచ్చినవాటికి బహుమతులూ ఇచ్చారు.

★ తనని తాను సగం డెమొక్రాట్‌నీ, సగం రిపబ్లికన్‌నీ అని చెప్పుకొనే మస్క్ ట్రంప్ అధ్యక్షుడిగా ఎన్నికైన కొత్తలో అడ్వైజరీ కమిటీలో సభ్యుడిగా ఉండేవారు. పారిస్ ఒప్పందంపై ట్రంప్ నిర్ణయం నేపథ్యంలో మస్క్ ఆ కమిటీ నుంచి వైదొలగారు. ★

# నగల్నీ కుట్టేస్తున్నారు!

**వీపు మీద ఓ యాభై బంగారు బుట్టలైనా వేలాడాలి... మెడ వెనుక రకరకాల హారాలను వరుసగా పేర్చాలి... చేతి నిండా చాంద్ బాలీలూ అరవంకీలను పెట్టేయాలి... పట్టణాలూ నగరాల్లో కాస్త పేరున్న ఏ టైలర్ షాపుకి వెళ్లినా ఈమధ్య వినబడుతున్న మాటలివే. ఇప్పుడు నగలు మగ్గాల మీద కూడా రూపుదిద్దుకుంటున్నాయి మరి. ఈ ఆభరణాలు జాకెట్లూ చీరల్నీ ఎంతో అందంగా అలంకరిస్తున్నాయి కూడా.**







ఎన్ని రకాల నగలున్నా వాటిలో ఇంకెన్ని భిన్నమైన ఫ్యాషన్లు వచ్చినా మరో కొత్త రకం నగ కోసం మగువ మనసు చేసే అన్వేషణ ఆగదు. బహుశా దేవుడు అమ్మాయిలతో పాటే ఆభరణం అన్న మాటను కూడా పుట్టించాడేమో. కాబట్టే తలకూ జడకూ చెవికీ చేతికీ ముక్కుకీ మెడకూ నడుముకీ నాభికీ కాలుకీ వేలుకీ... ఇలా నఖ శిఖ పర్యంతం ఆభరణం అమ్మాయిలో భాగమైపోయింది. అందానికి మెరుగులద్దుతోంది. ఆశ్చర్యం ఏంటంటే ఒంటి నిండా ఆభరణాలున్నా ఇంకా కొత్తవి పెట్టుకుంటే బాగుంటుందా... అనుకుంటూనే ఉంటారు. ఆ మక్కువే నగల్ని దుస్తులమీదికీ తెచ్చేసింది. జాకెట్లమీద బుట్టలూ చాంద్‌బాలీలూ వేరు వేరు డిజైన్ల పోగులూ హారాలూ అరవంకీలను ఎంబ్రాయిడరీ చేయించుకోవడం ఇప్పుడు నడుస్తోన్న ఫ్యాషన్ మరి. రకరకాల దారాలూ మెరిసే రాళ్లూ కుందన్లతో మగ్గం మీద రూపొందించే ఈ నగల్ని దూరం నుంచి చూస్తే పొరపాటున చెవి పోగు జారి జాకెట్టుకు వేలాడుతోందా... హారాలను మెడకే కాకుండా వీపుకీ వేలాడేస్తున్నారా... అనుకోవాల్సిందే. ఇక, అరవంకీ ఎంబ్రాయిడరీలైతే బంగారు అరవంకీ చేయించుకోలేదే అన్న ఆలోచనే రానంత అందంగానూ, జాకెట్టు జాకెట్టుకో కొత్త అరవంకీని పెట్టేశాం అన్నంత ట్రెండీగానూ ఉంటున్నాయి. వీటిలో కొందరు చేతుల మీద బుట్టల్లాంటి పెద్ద పెద్ద పోగులు రెండింటిని ఎంబ్రాయిడరీ చేయిస్తుంటే మరి కొందరు మొత్తం జాకెట్టూ క్రాప్ టాప్‌లమీద చిన్న చిన్న బుట్టలూ పోగుల్ని కుట్టిస్తున్నారు. మెడ వెనక భాగాన్ని చుడుతూ నెక్లెస్ ఆకారం వచ్చేలా చేస్తున్న ఎంబ్రాయిడరీ మరోరకం. అన్నట్లూ చీరల కొంగులమీదా పెద్ద పెద్ద పోగులూ గాజుల్ని ఎంబ్రాయిడరీ చెయ్యడం మరో సరికొత్త ఫ్యాషన్. అదండీ సంగతి... ఇదివరకు పెళ్లిళ్లకూ ఫంక్షన్లకూ ఏం నగలు వేసుకున్నారూ... అని చూసేవారు కాస్తా ఇప్పుడు ఏ నగలున్న జాకెట్లు వేసుకున్నారూ అని చూస్తున్నారు. ★






# కొత్తగా...



## ఇవేంటో చెప్పుకోండి..!

'చేపను ఒళ్లో పెట్టుకుని కూర్చున్నారేంటీ, దివాన్ కాట్, సోఫాల మీద కూరగాయలూ కోళ్లూ ఉన్నాయేంటీ...' ఈ త్రీడీ ప్రింటెడ్ కుషన్లను చూడగానే ఇంటికొచ్చి నవారెవరైనా ఓ నిమిషం ఇలా ఆలోచిస్తూ ఉండిపోవాల్సిందే. అవును, ఇక్కడ కనిపించేవి ముమ్మాటికీ కుషన్లే. రకరకాల పండ్లూ కూరగాయలూ చేపలూ కోళ్లూ ఇతర జంతువుల రూపాల్లో బుల్లి దిండ్లను తయారుచేసి, వాటికి ఆయా రూపాల్లో ఉన్న త్రీడీ కవర్లను తొడగడంతో చూసేవారికి అవిలా దర్శనమిస్తాయి. మీరూ మీ ఇంటిని వీటితో అలంకరించాలనుకుంటున్నారా... అయితే, ఆన్‌లైన్ షాపింగ్ సైట్ అలీ ఎక్స్‌ప్రెస్‌లో ఆర్డరిచ్చేయండి.

## ఇంటికెళ్లేసరికే వండేస్తుంది

ఆఫీసు నుంచి అలసిపోయి ఎప్పుడో ఇంటికొస్తాం. లేదంటే బయటి కెళ్లి ఏ రాత్రో ఇల్లు చేరతాం. ఆ సమయంలో అలసిపోయి ఉండి, అన్నం వండుకుని తినాలన్నా కష్టంగానే అనిపిస్తుంది. అలాకాకుండా ఇంట్లో ఎవరూ లేకపోయినా మనం వెళ్లేసరికి వేడి వేడి అన్నం రెడీగా ఉంటే ఎంత బాగుంటుందో కదా... ఆ పనే చేసిపెడుతుంది ఈ 'రైస్ వైజ్' కుక్కర్. దీని పైభాగంలో 1.5 కిలోల పాడి బియ్యాన్నీ, ఐదు లీటర్ల నీటినీ నిల్వ చేసే వెసులుబాటు ఉంటుంది. ఇక, మనం ఫోన్‌లోని ఆప్ సహాయంతో ఎన్ని కప్పుల బియ్యం ఏ సమయానికి ఉడకాలీ అని సెట్ చేసుకుంటే చాలు, రొబోటిక్ టెక్నాలజీతో పనిచేసే ఈ కుక్కర్ దానంతటదే సరిపడా బియ్యాన్ని తీసుకుని కడిగి, ఆ నీటిని బయటకు వదిలి, కొలతల ప్రకారం మళ్లీ నీటిని పోసుకుని చెప్పిన సమయానికి అన్నాన్ని వండి ఉంచేస్తుంది. ఇంకేముందీ ఇంటికి రాగానే వేడివేడి అన్నాన్ని హాయిగా తినేయొచ్చు. ఎప్పటికపుడు కావల్సినంత నీరు తీసుకునేలా ఈ కుక్కర్‌లో నీటిని నిల్వ చేసే భాగాన్ని పంపుకి అనుసంధానించి ఉంచుకునే వెసులుబాటు కూడా ఉంది. త్వరలోనే ఇది మార్కెట్లోకి వస్తుందట.






## ముడుచుకోవడానికీ బటనే!

వర్షాకాలంలో ఏదున్నా లేకపోయినా గొడుగు మాత్రం తప్పనిసరి. ఇక, బటన్ నొక్కగానే తెరుచుకునే గొడుగుల్ని వాడుతున్న ప్రతిసారీ 'అవి బటన్‌తోనే ముడుచుకునే వీలుకూడా ఉంటే బాగుండును' అని మనం అనుకోవడమూ సాధారణమే. కానీ ఇకమీదట ఇలా అనుకోవాల్సిన పని లేదు. అలాంటి గొడుగులు మార్కెట్లోకి వచ్చేశాయి మరి. 'ఫుల్లీ ఆటోమేటిక్ ఆటో ఓపెన్, క్లోజ్ అంబ్రెల్లా' పేరుతో వచ్చే ఈ గొడుగుల హ్యాండిల్‌కి ఉన్న ఒక బటన్‌ని నొక్కితే గొడుగు తెరుచుకుంటుంది, మరోటి నొక్కితే చిటికెలో ముడుచుకుంటుంది. ఆన్‌లైన్‌లో దొరుకుతున్న ఇవి రకరకాల రంగులూ సైజుల్లోనూ వస్తున్నాయి.



## కీ చెయిన్‌తో ఛార్జింగ్

ఖాళీ దొరికితే చాలు స్మార్ట్‌ఫోన్‌లో వీడియోలూ ఫొటోలూ చూడటం, ఇంటర్నెట్‌లో ఇతర పనులు చేసుకోవడం లాంటివి చేస్తుంటాం. అలాంటపుడు ఫోన్ ఛార్జింగ్ త్వరగా అయిపోతుంటుంది. కానీ ప్రయాణాల్లో ఉన్నపుడు వెంటనే ఛార్జింగ్ పెట్టుకోవడానికి అవకాశం ఉండకపోవచ్చు. ఈ సమస్యకు పరిష్కారంగానే పవర్ బ్యాంకులు వస్తున్నాయి. అయితే, అవి కాస్త పెద్దగా ఉండి పాకెట్‌లో పెట్టుకోవడానికీ వెళ్లిన ప్రతి చోటుకీ తీసుకెళ్లేందుకు వీలుండదు. ఆ ఇబ్బందిలేకుండా వచ్చిందే ఈ 'మిక్స్‌బిన్ హార్ట్ షేప్డ్ ఛార్జర్'. చిన్నగా కీచెయిన్‌తో సహా ఉండే ఈ పవర్ బ్యాంకుకి తాళాలు తగిలిస్తే ఎప్పుడూ మనతోనే ఉంటుంది కాబట్టి, ఎప్పుడు కావాలంటే అపుడు ఫోన్‌కి ఛార్జింగ్ పెట్టుకోవచ్చు.



## చిటికెలో బ్యాగుని మార్చేయొచ్చు

ఫ్యాషన్ అనో సౌకర్యం అనో బయటికెళ్లేటపుడు ఒకటీ, పార్టీలకెళ్లేటపుడు ఇంకోటీ ఆఫీస్‌కెళ్లేటపుడు మరోటీ అంటూ బ్యాగుల్ని మారుస్తాం. కానీ అలా మార్చిన ప్రతిసారీ వస్తువులన్నిటినీ కొత్త బ్యాగులో పొందిగ్గా సర్దుకోవాలంటే పెద్దపని. దాన్ని చిటికెలో చేసేందుకు వచ్చిందే 'ద బ్యాగ్ ఎక్స్ఛేంజ్'. ఎనిమిది చిన్నా పెద్దా పాకెట్లతో ఉండే దీన్లో మన వస్తువులన్నిటినీ సర్దుకుని బ్యాగులో పెట్టుకుంటే, మరో బ్యాగులోకి మార్చాలనుకున్నపుడు దాంతో పాటుగా తీసి పెట్టేసుకోవచ్చు. బ్యాగులో ఎక్కువ అరలు కావాలనుకునేవారికీ ఇది బాగా ఉపయోగపడుతుంది.



## బ్యాగు మీద రోజుకో ఫొటో!

డిజిటల్ ఫొటో ఫ్రేముల్లోలా బ్యాక్‌ప్యాక్ బ్యాగుల పైన కూడా రోజుకో కొత్త ఫొటోను ప్రదర్శించే వీలుంటే ఎంతబాగుంటుందో కదూ... అంతే మరి, ఫోన్లో ఎన్ని మంచి ఫొటోలున్నా పనిగట్టుకుని కనిపించినవారందరికీ చూపించలేం. అదే బ్యాక్‌ప్యాక్ మీద అప్‌లోడ్ చేస్తే అందరూ చూస్తారు... అదెలా సాధ్యం అని ఆలోచించాల్సిన అవసరం లేదు... ఈ పాప్-ఐ బ్యాగును కొనుక్కుంటే చాలు. దీని ముందుభాగంలో ఆప్‌తో పనిచేసే 'ఈ-పేపర్' స్క్రీన్ ఉంటుంది. మన ఫోన్‌లో ఉన్న ఏ ఫొటోనైనా దానిమీద వాల్‌పేపర్‌లా పెట్టుకోవచ్చు. ఇంకేముందీ, ఎప్పటికపుడు బ్యాగు లుక్కుని మార్చేయొచ్చు, వెనక వచ్చేవాళ్లు పిలిచి మరీ పొగిడేలా చెయ్యొచ్చు. మీరూ ఫిదా అయిపోయారా ఈ బ్యాగుకి..?




## ఈ షూకి అన్నీ తెలుసు

షూని తొడుక్కోగానే దానంతటదే కాలి సైజుకి తగ్గట్లు టైట్ అయితే, చలిగా ఉన్నపుడు పాదాలకు వెచ్చదనాన్నిస్తే, రోజు మొత్తంలో మనం ఎంత దూరం ఎన్ని అడుగులు నడిచామో గుర్తించి ఆ విషయాలతోపాటు ఎన్ని క్యాలరీలు కరిగించామో కూడా తెలియజేస్తే ఎంత బాగుంటుందో కదూ... అలాంటిదే ఈ డిజిట్ సోల్ షూ. సెన్సర్లుండే ఈ షూ ఆప్ సాయంతో పైన చెప్పినవన్నీ చేసేస్తుంది. షూ లోపల మనకు ఎంత ఉష్ణోగ్రత కావాలో ఆప్‌తో మనమే సెట్ చేసుకోవచ్చు కూడా. ఇక, రోజుమొత్తమ్మీద ఎన్ని క్యాలరీలు కరిగించామన్న విషయం కూడా ఆప్‌లో కనిపిస్తుంది. ఈ ఏడాదిలోనే ఈ షూని మార్కెట్లోకి తీసుకొస్తారట.

## అలంకరణ మరో మెట్టెక్కింది

ఇంట్లోని గోడల్నీ కిటికీలనూ వంట గదుల్నీ... ఇలా మూల మూలనూ అందంగా మార్చేందుకు రకరకాల అలంకరణ వస్తువులు మార్కెట్లోకి వస్తున్నాయి. మరి మెట్లను మాత్రం ఊరికే ఎందుకొదిలేయాలి... అందుకే, వాటినీ చూడముచ్చటగా మార్చేస్తున్నాయి త్రీడీ స్టెయిర్ స్టిక్కర్లు. ఏ మెట్టుకా మెట్టుకి విడిగా వచ్చే వీటిని మనింట్లో మెట్ల సైజుకి తగ్గట్లూ ఆర్డరిచ్చి తెప్పించుకోవచ్చు. ఆశ్చర్యం ఏంటంటే ఈ స్టిక్కర్లన్నిటినీ అక్కడిచ్చిన వరుసలో మెట్టుకీ మెట్టుకీ మధ్య అంటిస్తే మొత్తంగా చూసినపుడు ఓ సీనరీలా కనిపిస్తుంది. ఎగసిపడే జలపాతాలు మెట్లమీది నుంచి కిందికి దూకుతున్నట్లూ, సాగర తీరం ఇంటి మధ్యకొచ్చేసినట్లూ, నెమలి పింఛాలు ఓ చోట పోగుపడినట్లూ... కనిపించే ఈ అందాలన్నీ ఆ స్టిక్కర్లు తెచ్చినవే.







# సొంతానికి బైబిల్ ఉంటే మరణశిక్షే!

ఉత్తర కొరియా... ఈ పేరు వినగానే ముందుగా గుర్తుకొచ్చేది అణు పరీక్షలే. ఖండాంతర క్షిపణి పరీక్షలతో అమెరికా, దక్షిణ కొరియాలతో సహా ప్రపంచ దేశాలను బెంబేలెత్తిస్తోన్న నియంతల పాలనే. ఐక్యరాజ్యసమితి ఆదేశాలను కూడా ఖాతరు చేయకుండా, వ్యవహరిస్తోన్న ఆ దేశాధ్యక్షుడి తీరుతెన్నుల గురించి పక్కన బెడితే, ఆ దేశ స్థితిగతుల గురించి తెలుసుకోవాలన్న ఆసక్తితో అక్కడ పర్యటించిన సికింద్రాబాద్ వాస్తవ్యులైన **కోనేరు గోపాలకృష్ణ** అనుభవాలు...





కుమ్ సుసాన్ రాజప్రసాదం

ప్రదర్శన కోసం కిమ్ జోంగ్ మృతదేహం

ఉత్తర కొరియాను సందర్శించుకోవాలంటే ఎవరైనా సరే చైనా నుంచే ప్రయాణించాలి. అదీ అనుమతించబడిన ట్రావెల్ ఏజెన్సీల ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది. మేం కూడా హైదరాబాద్ నుంచి బీజింగ్‌కి వెళ్లి ఒకరోజు అక్కడ ఉండి, మర్నాడు బీజింగ్ విమానాశ్రయంలో ఉత్తర కొరియా అధికారిక విమానమైన ఎయిర్ కోర్యో ఎక్కి, రాజధాని నగరం ప్యాంగ్యాంగ్‌కి చేరుకున్నాం. ముందు రోజే అక్కడ మేం తప్పక పాటించాల్సిన నియమాల గురించి మా గైడ్ చెప్పాడు.

## కళ్లన్నీ మనమీదే!

ఎయిర్‌పోర్టు నుంచే ట్రావెల్ ఏజెన్సీ ఏర్పాటుచేసిన బస్సులో మా పర్యటన మొదలైంది. అందులో డ్రైవర్‌తోబాటు ఇంగ్లిష్ బాగా మాట్లాడగలిగిన గైడ్, ప్రభుత్వం నియమించిన అధికారిక మైండరు ఉన్నారు. ఈ మైండరు, మేం ఎక్కడికి వెళితే అక్కడకు మావెంటే వచ్చాడు. చివరకు మనం బస చేసిన హోటళ్లలోనే ఉంటూ నిరంతరం మనల్ని గమనిస్తూనే ఉంటాడు.

ముందుగా మేం 'ఆర్చ్ ఆఫ్ రీయునిఫికేషన్' అనే ప్రదేశానికి వెళ్లాం. ఇది ఉత్తర, దక్షిణ కొరియాల ఏకీకరణను కాంక్షిస్తూ కిమ్ ఇల్-సంగ్(తొలి అధ్యక్షుడు) కట్టిన స్మారక చిహ్నం. అక్కడ మనం ఏ ప్రదేశంలోనయినా ఫొటోలు దిగాలంటే గైడ్ అనుమతి తప్పనిసరి. మిలిటరీ ప్రదేశాలనూ, సైనికులనూ, పౌరులనూ క్లోజ్‌అప్‌లో ఫొటోలు తియ్యకూడదు. అక్కడి నుంచి నేరుగా సాయంత్రానికి మమ్మల్ని ర్యాన్‌గాంగ్ హోటల్‌కి తీసుకెళ్లారు. ఆ హోటల్ గేటు దాటి మనంతట మనం బయటకు వెళ్లకూడదు. హోటల్లో కూడా ఎవరితోనూ రాజకీయపరమైన చర్చలుగానీ, వారి నాయకులైన కిమ్‌లను కించపరిచే వ్యాఖ్యలుగానీ చేయకూడదు. ఉత్తర కొరియా ప్రజలు వారి నాయకులపట్ల దైవ సమానమైన భక్తి భావన కలిగి ఉండాలి. దానికి చిహ్నంగా ప్రతివారూ చొక్కాపై ఆ దేశ వ్యవస్థాపకుడైన కిమ్ సంగ్ బొమ్మ ఉన్న బ్యాడ్జ్‌ను ధరిస్తారు. అక్కడ దొంగతనాలు ఎక్కువ. జనం జేబుల్లో విలువైన వస్తువులేవీ ఉండవు. దాంతో దొంగలు ఆ బ్యాడ్జినే కొట్టేసి, బ్లాక్ మార్కెట్‌లో అమ్మేస్తుంటారు. అది లేకుండా వాళ్లు పబ్లిగ్గా తిరగకూడదు మరి. అక్కడ ప్రైవేటు వాహనాలు అరుదు. పబ్లిక్ వాహనాల్లోనే తిరగాలి. అదీ ఒక ఊరి నుంచి మరో ఊరికి వెళ్లాలంటే ప్రభుత్వ అనుమతి తప్పనిసరి.

## సంగ్ క్యాలెండరు!

ప్రతి కార్యాలయంలోనూ ఇంట్లోనూ గోడ మీద కిమ్ సంగ్, ఆయన వారసుడైన కిమ్ జోంగ్‌ల బొమ్మలు తప్పకుండా ఉంటాయి. చివరకు మా హోటల్ రూమ్‌లోనూ కిమ్‌ల గురించిన క్యాలెండరు ఉంది. దీన్ని జూచె క్యాలెండర్ అంటారు. కిమ్‌సంగ్ పుట్టినతేదీ, 15 ఏప్రిల్ 1912 ఆధారంగా దీన్ని రూపొందించారట. ఆ రాత్రికి కొరియా ప్రత్యేక వంటకమైన కోల్డ్ నూడుల్స్ తిని, విశ్రమించాం.

మర్నాడు ఉదయం మేం ఉత్తర-దక్షిణ కొరియాల సరిహద్దు ప్రాంతమైన పాన్ మున్ జోంకి బయలుదేరాం. ఇక్కడే డీ మిలిటరైజ్డ్ జోన్ ఉంది. ఇరు కొరియాల మధ్య కాల్పుల విరమణ ఒప్పందం జరిగింది ఇక్కడే. అయితే ఇది శాంతి ఒప్పందం కాదు. కాబట్టి సాంకేతికపరంగా 1950లో మొదలైన కొరియా యుద్ధం నేటికీ కొనసాగుతున్నట్లే.

ఇరు దేశాల సైనికులు నాలుగు నుంచి ఐదు మీటర్ల దూరంలో ఎదురెదురుగా నిల్చుని కనిపిస్తారు. మాలాగే దక్షిణ కొరియాకి వచ్చిన యాత్రికులు మాకు ఎదురుగా సరిహద్దు రేఖ ఆవలినుంచి కనిపిస్తారు. ఇక్కడ మాత్రం సైనికుల ఫొటోలను నిరభ్యంతరంగా తీసుకో వచ్చు. కొంతసేపు అక్కడ గడిపిన తరవాత దగ్గరలో ఉన్న కేసాంగ్ కోర్యో మ్యూజియంను సందర్శించాం. ఇక్కడ ప్రాచీనకాలం నాటి కోర్యో రాజులకు సంబంధించిన వస్తువులూ ఆయుధాలూ భద్రపరిచారు. పక్కనే ఉన్న ప్రాచీన కన్ఫ్యూషియస్ విశ్వవిద్యాలయాన్ని కూడా చూసి అక్కడే ఉన్న రెస్టరెంట్లో సంప్రదాయబద్ధమైన పాన్ సన్ గి భోజనం చేసి ప్యోంగ్యాంగ్‌కు బయలుదేరాం.

ఆ సాయంత్రం ప్యోంగ్యాంగ్‌లోని మెట్రో స్టేషన్‌కి వెళ్లాం. ఇది ప్రపంచంలోకెల్లా లోతైన మెట్రోస్టేషన్. ప్రతి స్టేషనులోనూ వీధి కూడళ్లలోనూ మొజాయిక్ రాళ్లతో చేసిన పెద్ద సైజు కిమ్‌ల బొమ్మలు కనిపిస్తాయి. ప్రతి 3.5 కిలోమీటర్లకీ కిమ్‌సంగ్‌ది ఓ విగ్రహమైనా ఉంటుంది. ఇలా దాదాపు 34 వేల విగ్రహాలు ఉన్నట్లు అంచనా. అంటే జనాభాలో ప్రతి 750 మందికి ఓ సంగ్ విగ్రహం ఉందన్నమాట.

### కటింగుల్లోనూ కటింగే!

అక్కడ నుంచి గోల్డేన్ లేన్ బౌలింగ్ సెంటర్‌కు వెళ్లాం. ఇది ప్యోంగ్యాంగ్ పౌరుల వినోదానికి ఉద్దేశించిన పార్కు. ఇక్కడ మాత్రమే మేం కొరియా ప్రజలను దగ్గరగా చూడగలిగాం. ప్రస్తుత అధ్యక్షుడైన కిమ్ జోంగ్-ఉన్ జీన్స్‌నీ ముక్కులూ చెవులూ కుట్టించుకోవడాన్నీ నిషేధించాడు. దాంతో జీన్స్ వేసుకున్నవాళ్లు కనిపించరు. సెలూన్లలో ప్రభుత్వం అనుమతించిన హెయిర్ కట్‌లు మాత్రమే బోర్డులో ఉంటాయి. వాటిలోంచే చేయించుకోవాలి. అందుకే దాదాపు అందరి కటింగులూ ఒకేలా ఉంటాయి. ఉత్తర కొరియాలో క్రిస్టియన్లు ఉన్నప్పటికీ కూడా సొంతానికి బైబిలు కలిగి ఉన్నా; దక్షిణ కొరియా సినిమాలు చూసినా, అశ్లీల చిత్రాలను సరఫరా చేసినా మరణశిక్ష తప్పదట. ఆయా కారణాలతో 2013లో కావాలని అందరూ చూస్తుండగా 80 మందిని కాల్చేశారట. కానీ మనమెంతో నేరంగా భావించే గంజాయి పెంచడం, వాడకం, సరఫరా అక్కడ చట్టబద్ధమే.


భార్యతో వ్యాసకర్త

ఉత్తర కొరియాలో ఇంటర్నెట్, మొబైల్ ఫోన్లు ఉన్నప్పటికీ వాటిని ఉపయోగించే వాళ్ల సంఖ్య చాలా తక్కువ. సుమారు రెండున్నర కోట్ల జనాభాలో దాదాపు రెండువేల మంది కూడా ఉండరు. అది కూడా వాళ్లదైన రెడ్ స్టార్ అనే ఆపరేటింగ్ వ్యవస్థనే వాడతారు.

మర్నాడు ఉదయం కుమ్-సుసాన్ గ్రాండ్ ప్యాలెస్‌కు బయలుదేరాం. ఇది ఓ రాజప్రాసాదం. ఇక్కడ చనిపోయిన కిమ్‌ఇల్-సంగ్, ఆయన కొడుకు కిమ్‌జోంగ్-ఇల్‌ల మృతదేహాలను పాడవకుండా ఎంబామింగ్ చేసి ప్రదర్శిస్తారు. కొరియా ప్రజలూ సందర్శకులూ వీటిని తప్పనిసరిగా సందర్శిస్తుంటారు. అయితే ఇక్కడ ఫొటోలు నిషిద్ధం. మధ్యాహ్న సమయానికి మన్సుదే గ్రాండ్ మాన్యుమెంట్‌కు చేరుకున్నాం. అక్కడ కిమ్‌ఇల్-సంగ్, కిమ్‌జోంగ్-ఇల్‌ల 22 మీటర్ల ఎత్తైన ఇత్తడి విగ్రహాలను ప్రతిష్ఠించారు. వాటికి గౌరవ వందనం చేసి కిమ్‌ఇల్-సంగ్ జన్మస్థలమైన మంగోంగ్-దే కి వెళ్లాం. ఈ కొండ ప్రాంతాన్ని అందంగా తీర్చిదిద్దారు. ఇక్కడే కిమ్ ఇల్ సంగ్ తల్లిదండ్రుల ఇల్లూ, వారు వాడిన వస్తువులూ ప్రదర్శనకు ఉంచారు.

అక్కడి నుంచి విక్టరీ ఫాదర్ ల్యాండ్ మెమోరియల్ వార్ అనే మ్యూజియానికి చేరుకున్నాం. కొరియా- అమెరికా యుద్ధంలో స్వాధీనం చేసుకున్న అమెరికా ట్యాంకులూ యుద్ధ విమానాల శకలాలను అక్కడ ప్రదర్శించారు. యుద్ధానంతరం కొరియాపై గూఢచర్యం చేస్తూ పట్టుబడిన పెబ్లో అనే అమెరికా యుద్ధనౌకను అక్కడ ఉంచారు.

మరుసటి రోజు మేమంతా ప్యోంగ్యాంగ్ పర్యటనకి బయలుదేరాం. సోషలిస్టు దేశం కాబట్టి భారీ దుకాణాలూ షాపింగుమాల్సూ కనిపించలేదు. ప్రత్యేకంగా విదేశీ యాత్రికుల కోసమే కేటాయించిన షాపులకి తీసుకెళ్లారు. వాటిలో ధరలన్నీ చైనీస్ యెన్‌లలో కానీ యూరోలలోకానీ ఉంటాయి. వాటిల్లో సామాన్య కొరియా ప్రజలు కొనలేరు.

ఉత్తర కొరియా కరెన్సీ వోన్. దీని విలువ మన కరెన్సీకన్నా తక్కువ. ఒక్క రూపాయి 14.09 వోన్‌లతో సమానం. వాళ్ల కరెన్సీని పర్యటకులు వాడటానికి కూడా ఇవ్వరు. మధ్యాహ్నం కొరియన్ బీరు ఫ్యాక్టరీనీ హైస్కూల్‌నూ సందర్శించాం. అక్కడి స్కూల్లో ఇంగ్లిషు క్లాసు జరుగుతున్నప్పుడు విద్యార్థులతో కాసేపు గడిపాం. ఆ దేశం నూటికి నూరుశాతం అక్షరాస్యత సాధించినట్లు ప్రభుత్వం పేర్కొంటోంది. అయితే కొరియా నాయకుల గురించి తప్ప వాళ్లకు బయటి ప్రపంచం గురించిన అవగాహన తక్కువ. చివరకు ఉత్తరం రాయాలన్నా ముందు 'ప్రెసిడెంట్ ఆఫ్ ఎటెర్నిటీ' కిమ్ సంగ్, 'డియర్ లీడర్' కిమ్ జోంగ్ ఇల్ అని మొదలుపెట్టాల్సిందేనట. కిమ్ జోంగ్-ఇల్ ఆకాశంలో రెండు ఇంద్రధనుస్సులు ఏర్పడిన సమయంలో పుట్టాడనీ, ఆయన పుట్టిన వేళలో ఆకాశంలో ఓ తార ఆవిర్భవించిందనీ, ఆరు నెలలకే నడవడం, మాట్లాడటం చేశాడనీ, మనసుతోనే వాతావరణాన్ని శాసిస్తాడనీ... ఇలా దేవుడిలా కీర్తిస్తూ ఆయన జీవితం గురించి ప్రభుత్వం పుస్తకాలూ విడుదల చేసిందట. అక్కడి ప్రభుత్వం ఇప్పటికీ మరణించిన సంగ్ పేరుతో అధికారిక పత్రాలను జారీచేస్తుంటుంది. సంగ్, జోంగ్‌లు మరణించిన తేదీలైన జులై 8, డిసెంబరు 17న పుట్టినవాళ్లు ఆ రెండు రోజుల్లో పుట్టినరోజుని జరుపుకోరు. ఆ కారణంతోనే లక్షమంది ఆ మరుసటి రోజుల్లో జరుపుకుంటున్నారట.

### ఊపిరి పీల్చుకున్నాం!

చివరగా ఆ రోజు సాయంత్రానికి జూచే టవర్ చేరుకున్నాం. జూచే తత్త్వానికి ప్రతీకగా నిలిచిన ఈ స్మారకాన్ని ప్రపంచంలోనే ఎత్తైన రాతి స్థూపంగా అభివర్ణించారు. కిమ్ ఇల్-సంగ్ రూపొందించిన స్వావలంబన సిద్ధాంతాన్నే జూచే తత్త్వం అంటారు. ఈ స్థూపం ప్రాంగణంలో భారత్ నుంచి 1971లో ఓ యూత్ స్టడీ గ్రూప్ ఈ జూచే తత్త్వాన్ని అధ్యయనం చేయడానికి ఇక్కడికి వచ్చినట్లుగా అక్కడ ఓ శిలాఫలకం ఉంది. ఈ టవర్ మీద నుంచి ప్యోంగ్యాంగ్ నగరం మొత్తాన్ని కొద్దిసేపు వీక్షించి ఫొటోలు తీసుకుని తిరిగి మా హోటల్‌కు వెళ్లి మర్నాడు తిరుగు ప్రయాణానికి అన్నీ సిద్ధం చేసుకుని, ఆ రాత్రికి విశ్రమించాం.

ప్యోంగ్యాంగ్ నుంచి బీజింగ్ వరకూ మా తిరుగు ప్రయాణాన్ని రైల్లో బుక్ చేసుకున్నాం. మార్గమధ్యంలో వచ్చే స్టేషన్లలో కంపార్టుమెంట్లో నుంచి బయటకు దిగడానికి అనుమతించరు. ఉత్తర కొరియా-చైనా సరిహద్దు సినుఇజు స్టేషన్‌కు చేరగానే అక్కడి సెక్యూరిటీ గార్డులు మా పాసుపోర్టులూ సామాన్లూ కెమెరాలను క్షుణ్ణంగా తనిఖీ చేశారు. కెమెరాల్లో అభ్యంతరకర ఫొటోలు ఉంటే డిలీట్ చేసేస్తారు. అక్కడ ఇమ్మిగ్రేషన్ సెంటర్‌లో అవన్నీ అయ్యాక కొరియా-చైనాల స్నేహ వారధి యాలు నది వంతెన దాటి, రైలు చైనాలోని డాన్‌డోంగ్ స్టేషన్‌కి చేరగానే మా బృందంలోని సభ్యులమంతా హమ్మయ్య అనుకుంటూ ఊపిరి పీల్చుకున్నాం. అక్కడ నుంచి బీజింగ్ ద్వారా హైదరాబాద్‌కు తిరిగొచ్చాం. ★

కథ

# ప్రేమసూత్రం

- నరెడ్ల అచ్యుతరామం

**సాయంకాలం నాలుగున్నరవుతోంది. నాతో మాట్లాడుతూ కూర్చున్న అక్క చటాలున లేచి "పరిమళా, ఈ సన్నజాజులు మాల కడుతూ ఉండు, నేను స్నానం చేసి వస్తాను. మీ బావగారు వచ్చే టైమయింది... పిల్లలూ మీరు హోమ్‌వర్కు పూర్తిచేయండి" అని చెప్పింది హడావుడిగా లోపలికెళ్తూ.**

**"అప్పుడే ఎక్కడక్కా, ఆఫీసు అయిదు గంటలకైపోతే ఏ ఆరింటికో ఏడింటికో నిదానంగా అన్ని పనులూ చక్కబెట్టుకొని వస్తారు. మా ఆయన్ని చూస్తున్నాను కదా... ఒక్కరోజూ పెందరాడే వచ్చిన పాపాన పోలేదు" అన్నాను.**

"లేదురా, మీ బావగారు 5.15 కల్లా ఇంటి దగ్గరుంటారు" అనేసి, వెళ్ళి స్నానం ముగించి ముస్తాబై వచ్చింది. ఎంతో అందంగా ఉంది అక్క. నాకంటే పదిహేనేళ్ళు పెద్దది. కానీ, ముప్పై ఏళ్ళకు మించి కనపడదు. నేనిచ్చిన సన్నజాజి మాల తలలో పెట్టుకుంటే మరింత బాగుంది. ఇంతలో బండి హారన్ వినిపించింది. గేటుకేసి చూస్తే బావగారు! టైము చూస్తే 5.15. నాకు చాలా ఆశ్చర్యమనిపించింది.

"గుడ్ ఈవెనింగ్ సార్, ఈరోజు మీకో సర్‌ప్రైజ్. మనింటికెవరొచ్చారో చెప్పుకోండి చూద్దాం" అంటూ అక్క నాకు చాటుగా నిలబడింది.

"వెరీగుడ్ ఈవెనింగ్ మాలా. పరిమళ వచ్చుండవచ్చు" అన్నారు బావగారు.

"ఎలా చెప్పగలిగారు బావగారూ?" ఆశ్చర్యంగా అడిగాను.

"మీ అక్క ముఖం మతాబులా వెలిగి పోతుంటే ఆ మాత్రం ఊహించలేనా ఏంటి" అన్నారు నవ్వుతూ.

"మీరు త్వరగా ఫ్రెష్ అయి రండి, పకోడీలు చల్లారకుండా" అంటూ అక్క బావగారికి లుంగీ టవలూ ఇచ్చింది.

"ఈరోజు పిక్చర్‌కు వెళ్దాం, త్వరగా రెడీ అవ్వండి" అని బావగారనగానే పిల్లలు కేరింతలు కొట్టారు.

ఇంటర్వెల్‌లో బావగారు అందరికీ పాప్‌కార్న్‌లూ డ్రింకులూ తెచ్చారు.

భోజనాల దగ్గర అక్క అందరికీ కొసరికొసరి వడ్డించింది.

"పరిమళా, ప్రయాణం చేసొచ్చి బాగా అలిసిపోయి ఉంటావు, పడుకో. పిల్లలూ... పిన్నిని ప్రశ్నలతో వేధించకుండా పడుకోండి. గుడ్‌నైట్" అంటూ తన గదిలోకి వెళ్ళిపోయింది అక్క. పిల్లలూ నేనూ మరో గదిలో పడుకున్నాం.

★ ★ ★

ఎంతసేపైనా నాకు నిద్ర రావడం లేదు. అక్క జీవితం చూస్తే నాకెంతో ఆనందంగా ఉంది. ఎంత అన్యోన్యంగా ఉంటున్నారు! మరి నా జీవితం ఎందుకిలా ఉంది? నా లోపమా... సురేష్ లోపమా? ఎప్పుడూ నామీద అజమాయిషీ చెలాయించాలని చూస్తాడు. భార్యంటే అణిగిమణిగి ఉండాలంటాడు. ప్రతి చిన్న విషయానికీ పెద్ద రభసా వాదనా. ఛ! ఛ! పెళ్ళైన రెండేళ్ళకే లైఫ్ బోరు కొట్టేస్తోంది. ఇలాంటి ఆనందకరమైన రోజు ఒక్కటి కూడా గడిపింది లేదు. ఈ వయసులో కూడా అక్కా బావగారూ ఎంత ఎంజాయ్ చేస్తున్నారు. 'ఏదో ఉపాయం ఉంది. అక్కనడగాలి' అనుకున్నాను.

★ ★ ★

"గుడ్ మార్నింగ్ మాస్టారూ" అక్క మాట వినపడింది.

"వెరీగుడ్ మార్నింగ్. అప్పుడే తెల్లారిందా? ఆ... మాలా, కాలు కొంచెం బెణికిందన్నావు, ఎలా ఉంది? కాస్త ఆయిల్ రాస్తాను ఇలా కూర్చో" పిలిచారు బావగారు.

"పరవాలేదండీ, తగ్గిపోయింది" అంటున్నా వినకుండా,

"అదేం కుదరదమ్మలూ, నువ్వు రావల సిందే" అంటూ బావగారు అక్కను దగ్గరకు తీసుకుని మెల్లగా మంచం మీద కూర్చోబెట్టి ఆయిల్ మర్దనా చేస్తున్నారు. గాలి



కెగిరిన కర్టెన్ పక్కనుంచి కన్పించిన ఈ దృశ్యం నాకెంతో ముచ్చటగా అనిపించింది. ఒక్కసారి గతం గుర్తుకొచ్చింది. తను ఒకసారి గుమ్మం తగిలి పడిపోయింది. అక్కడే ఉన్న సురేష్ తనకు చేయందించి లేపుతాడనుకుంది.

'కొంచెం చూసుకుని నడవచ్చు గదా. టేబుల్ మీద జండూబామ్ ఉంది, రాసుకో. నాకు ఆఫీసుకు టైమవుతోంది. తొందరగా కేరియర్ సర్దు' అనేసి స్నానానికి వెళ్ళిపోయాడు.

తనకు చిర్రెత్తుకొచ్చింది. సానుభూతిలేదు సరిగదా... ఆర్డర్లు. అందుకే అంటారు 'పుణ్యంకొద్దీ పురుషుడని' అనిపించింది.

"పరిమళా, స్నానంచేసి రా, టిఫిను చేద్దువుగాని. మీ బావగార్ని ఆఫీసుకు పంపి వస్తాను" అక్క పిలుపుతో వర్తమానంలోకి వచ్చాను.

హాల్లో అక్కా నేనూ తీరుబడిగా టిఫిన్ చేస్తున్నాం. "ఊఁ, ఎలా ఉంది సంసారం? సురేష్ ఎలా ఉంటాడు? ఏం ఇబ్బంది లేదు గదా?" అడిగింది అక్క.

"ఏం చెప్పమంటావు అక్కా, 'మూడు దెబ్బలాటలూ ఆరు అలకలూ' అన్నట్టు ఉంది మా కాపురం. బావగారంతటి సౌమ్యుడూ మంచివాడూ కాదు సురేష్. అతని దృష్టిలో భార్యంటే జీతంలేని పనిమనిషి. ఇంచుమించు రెండు రోజులకొకసారి ఏదో విషయంలో వాదన తప్పదు. నా వ్యక్తిత్వాన్నీ ఆత్మగౌరవాన్నీ కించపరిస్తే నేనూరుకోలేను గదా. దాంతో ఎడమొహం, పెడమొహం. ఎంఎస్సీ చేసినదాన్ని హాయిగా ఏ యూనివర్సిటీలోనో పీహెచ్‌డీ చేసి మంచి ఉద్యోగం చేసుకునే బదులు, ఈ రొంపిలో పడ్డాను" అంటుంటే,



ఒక్కసారిగా దుఃఖం పొంగుకొచ్చింది.

"పిచ్చిపిల్లా, బాధపడకు. కాస్త ఫ్రెష్ అయి రా! నీతో చాలా విషయాలు మాట్లాడాలి" అనగానే లేచివెళ్ళి మొహం కడుక్కుని వచ్చాను.

"జీవితానికి పరిపూర్ణత డబ్బుతోనో హోదాతోనో రాదు పరిమళా. ఎంత పెద్ద చదువులు చదివినా, ఎంతటి ఉన్నత స్థానానికి వెళ్ళినా - వివాహం, పిల్లలూ, బంధాలూ ఇవన్నీ లేకపోతే జీవితం పరిపూర్ణత చెందినట్టు కాదు. పెళ్ళైన స్త్రీ మరో ఇంటికి వెళుతుంది. అక్కడి వ్యక్తులతో ప్రేమ, అనుబంధం పెంచుకుని వారితో పాలలో నీళ్ళలా కలిసిపోవాలి. గుమ్మం ఎత్తు తక్కువగా ఉంటే తల కాస్త వంచి నడుస్తాం. అది అవమానం కాదు, తల దించుకోవడమూ కాదు. వ్యక్తిత్వం, ఆత్మగౌరవం... శరీరానికిగానీ ఆత్మకుగానీ అంటని పదాలు. అహంకారంవల్ల కలిగే ఈ భావనలు మనల్ని అందరి నుంచీ వేరు చేస్తాయిగానీ కలపవు. ఎవరి జీవితం ఎంత కాలమో ఎవరికీ తెలియదు. ఈ స్వల్పకాలంలో, సంఘర్షణలతో జీవితాన్ని నరకప్రాయం చేసుకోవడం అవసరమా?" అడిగింది అక్క.

"లేదక్కా, నేను తనకి కట్టుబానిసనను కుంటాడు. నామీద అనుక్షణం అధికారం చెలాయించాలనుకుంటాడు. నిజానికి అతను నాకు బానిసగా ఉండాలి. ఎందుకంటే నేను కట్నమిచ్చి అతన్ని కొనుక్కున్నాను గనుక" అన్నాను కోపంగా.

"ఆ... అదే నేను చెప్పేది. ఇటువంటి అభిప్రాయాలు రైలుపట్టాల లాంటివి. ఎక్కడా కలవవు. వివాహంలో భర్త భార్యకు తాళికట్టి ఒక బంధాన్ని ఏర్పరుస్తాడు. తరవాత భార్య భర్తకు ప్రేమసూత్రంతో మూడుముళ్ళు వేయాలి. అప్పుడది ఎప్పటికీ విడివడని బంధం అవుతుంది. నువ్వు ప్రేమ పంచితే నీకు తిరిగి ప్రేమ వస్తుంది. ద్వేషం, కోపం పంచితే తిరిగి అవే వస్తాయి. వివాహమైన స్త్రీ ఎలా ఉండాలో పెద్దలు చెప్పారు. పనులు చేసేటప్పుడు దాసిలా ఉండాలట. 'నేను పనిమనిషినా' అని అనుకోకూడదు. దాసి ఎంత వినయంగా, నమ్మకంగా పనిచేస్తే అంతగా తన యజమాను రాలి నుండి ప్రేమ పొందుతూ తన అవసరాలు తీర్చుకుంటుంది. సలహాలిచ్చేటప్పుడు మంత్రిలా ఉండాలి. అంటే ఆ సలహాలు మొత్తం మన కుటుంబానికి మేలు చేయాలి. అన్నం పెట్టేటప్పుడు తల్లి తన కొడుకు ఎంతిచ్చాడు, తనను ఎలా చూస్తున్నాడని ఆలోచించదుగా. తృప్తిగా రుచికరంగా భోజనం పెడితే ఆ భర్త తన భార్యలో తల్లిని చూస్తాడు. ఏ స్త్రీ అయితే పడక గదిలో భర్తను మురిపించి, వశం చేసు



కుంటుందో ఆమె ఉత్తమ స్త్రీ అనేదే 'శయనేషు రంభా' అన్నదానికి అర్థం. ఇవన్నీ మన పూర్వులు పాటించేవారు కనుకే వారికి విడాకుల సమస్యలు లేవు. మరి ఇప్పటివాళ్ళు పెళ్ళైన మూడు నెలలకే లాయర్లను కలుస్తున్నారు. ఇవన్నీ కేవలం భర్త కోసమేననుకుంటే పొరపాటే. వీటన్నిటిలో స్త్రీ సౌఖ్యం, ఆనందం కూడా అంతర్లీనమై ఉన్నాయి. నీ భర్త నీ వశం కావాలంటే ముందు నువ్వు అతని వశమవ్వాలి. వాదనల వల్ల ఒరిగేదేమీ లేదు. ఒకరి అజ్ఞానాన్నీ అహంకారాన్నీ మరొకరికి ఎక్స్ఛేంజ్ చేసుకోవడం తప్ప. నిరంతరం ఘర్షణపడితే ఇంట్లో సుఖమూ శాంతీ ఎక్కడినుంచొస్తాయి. మన పిల్లలకు మంచీ చెడూ ఎలా చెప్పగలం? వివాహమైన స్త్రీ రెండు కుటుంబాలకు వారధి. ఎంతసేపూ అవతలివారు మారాలనుకుంటాంగానీ మనమెందుకు మారకూడదు?

ఇప్పటి మీ బావగారికీ ఒకప్పటి బావగారికీ ఎంతో తేడా ఉంది. అప్పట్లో తనూ అంతే. ప్రతిదానికీ కోపమే, వాదనే. కానీ నేను ఏనాడూ ఎదురు వాదించలేదు. ద్వేషంతో వాదనతో దూరం జరగకుండా ఆయన ఏదంటే అలాగే చేస్తూ ప్రేమతో సర్దుబాటుతో దగ్గరయ్యాను. ఎంతో ప్రయత్నంతో ఆయన్ని ఇలా మార్చుకున్నాను. ఇప్పుడు ఇద్దరం ఒకేసారి టిఫిన్ చేస్తాం. భోజనం చేస్తూ కుటుంబ విషయాలు మాట్లాడుకుంటాం. రాత్రయ్యేసరికి ఇష్టంగా పడకను చేరతాం. ఆ సాన్నిహిత్యం ఎంతో ప్రేమనూ అనుబంధాన్నీ పెంచుతుంది. అప్పుడు ఒకరి లోపాలు మరొకరికి కనపడవు. సెలవైతే ఆయన వంటగది వదలరు. ఎక్కడికి వెళ్ళినా ఇద్దరం కలిసే వెళ్తాం. ప్రతిరోజూ ఆఫీసు నుండి కనీసం రెండుసార్లైనా ఫోన్ చేస్తారు. నా సలహా తీసుకోకుండా, నాకిష్టం లేకుండా ఏ పనీ చేయరు. ఇప్పుడు చెప్పు, నేను ఇలా ఉన్నందువల్ల నా ఆత్మగౌరవానికేమైనా భంగం కలిగిందా? నా పిల్లలూ భర్తా ఆయన తరఫువారూ నన్నెంతో అభిమానిస్తారు. వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటున్నానను కుంటూ నీకూ సురేష్‌కూ ఆత్మశాంతి లేకుండా, అత్తమామలకు మనశ్శాంతి లేకుండా గడపడం మంచిదా... ప్రేమతో అతణ్ణి కొంగున ముడేసుకోవడం మంచిదా? నువ్వే ఆలోచించు, ఛాయిస్ ఈజ్ యువర్స్" అక్క ముగించింది.

నా మనసును కమ్మిన పొరలేవో తొలగినట్లయింది. అమాంతం అక్కను కౌగిలించుకుని ముద్దు పెట్టుకున్నాను.

"ఎంత బాగా చెప్పావు అక్కా! జీవితమంటే ఏంటో ఇప్పుడు తెలిసింది. సురేష్ వచ్చి బ్రతిమిలాడి తీసుకెళ్తే తప్ప- ఎన్నాళ్ళైనా సరే వెళ్ళొద్దనుకున్నాను. కానీ రేపే బయల్దేరతాను. 'నిజంగా గెలవడమంటే ఇష్టంగా ఓడడమంతే' అని ఏదో పాటలో విని, 'అదేంటీ' అనుకున్నాను. 'భార్యాభర్తల మధ్య గెలుపోటములు ఉండవు- సర్దుబాట్లు తప్ప' అని ఇప్పుడర్థమైంది. ఇన్నాళ్ళూ నేను ప్రతి చిన్నదానికీ వాదిస్తూ, వాదనలో గెలిచాననుకుంటూ అనుబంధాల అల్లికలో ఓడిపోయాను. ఇకపై అలాకాదు, మొండి వాదనతో మాటల్లోకాక సర్దుబాటుతో జీవితంలో గెలుస్తాను. నీ సలహా పాటించి అతిత్వరలో సురేష్ మనసు గెలుచుకుని ఇద్దరమూ కలిసి నీ ఆశీస్సుల కోసం వస్తాం, చూస్తుండు..." ధీమాగా చెప్పిన నన్ను నవ్వుతూ చూస్తూ,

"మా పరిమళ బంగారు తల్లి. ఇలా చెబితే అలా అల్లుకుపోతుంది" అంది అక్క నా భుజాల చుట్టూ చేతులు వేసి దగ్గరకు తీసుకుంటూ.



## కలం కదిలించండి

సృజనాత్మకత కలిగిన రచయితలకూ రచయిత్రులకూ ఇదే ఆహ్వానం. మానవ జీవితంలోని విభిన్న పార్శ్వాలను స్పృశిస్తూ మధురమైన అనుభూతులను పాఠకులకు పంచే కథలకు 'ఈనాడు' స్వాగతం పలుకుతోంది. భావం ఏదైనా... కథనంలో వైవిధ్యం, పాఠకులను ఏకబిగిన చదివించగలిగే బిగువూ ఉండాలి. ఆశావహ దృక్పథంతో సాగే కథలకు ప్రాధాన్యం. కథ సాధారణ చేతి రాతలో ఏడు అరఠావులకు మించకూడదు.

కథలు పంపాల్సిన చిరునామా:

**ఆదివారం అనుబంధం**
**ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ,**
**హైదరాబాద్-82.**

సినిమా దృశ్యశ్రవణ మాధ్యమం. ఆ రెండిటిలో ఏ ఒక్కటి లోపించినా అర్థం అసంపూర్ణమే. కానీ జీవితమే నిశ్శబ్ద చిత్రమైనా తాము చెప్పదలచుకున్నది అందరికీ అర్థమయ్యేలా చెప్పడంతో పాటు తమను తాము ఏడురంగుల హరివిల్లుమీద ఆవిష్కరించుకుంటోంది ఈ బృందం. పేరు డెఫ్ రెయిన్‌బో ఫిల్మ్స్. ప్రవృత్తి లఘుచిత్రాలు తీయడం.



# మాట్లాడలేకపోతేనేం... సినిమా తీస్తారు!

విద్యావంతుడైన ఓ యువకుడు పార్కులో జంటలుగా తిరుగుతున్నవారిని చూసి తనకీ ఓ గర్ల్‌ఫ్రెండ్ ఉంటే బాగుంటుందనుకుంటాడు. పార్కులో బల్ల మీద ఓ యువతి ఒంటరిగా కన్పిస్తుంది. హుందాగా ఆమె దగ్గరికి వెళ్లి పరిచయం చేసుకోబోతాడు. ఆమె గుర్తించదు, ఇంతలో మరో అమ్మాయి వచ్చి ఆమెను తీసుకెళ్తుంది. వారి సంభాషణ తీరు చూసి ఆమె అంధురాలు, బధిరురాలు కూడానని అర్థమై యువకుని మనసు చిన్నబోతుంది. ఆలోచిస్తూ అక్కడే కూర్చుంటాడు. ఇంతలో మరో అమ్మాయి వచ్చి కాస్త దూరంగా కూర్చుని ఫోనులో చాట్ చేస్తుంటుంది. యువకుడు హలో చెప్తే ఆమె కోపంగా చూస్తుంది. మాటరాని అతడి సంకేత భాషను అపార్థం చేసుకున్న ఆమె ఆవేశంగా అక్కడ్నుంచి వెళ్లిపోతుంది. ఇతరులకు ఫిర్యాదు చేస్తుంది. అది చూసి యువకుడి మనసు వికలమైపోతుంది. తానేమీ అమర్యాదగా ప్రవర్తించలేదు. అపరిచితులతో తన గురించి ఫిర్యాదు చేసిన ఆమె తనతో సంభాషించడానికి ఎందుకు ప్రయత్నించలేదు, ఎందుకు తనని అర్థం చేసుకోలేదు... అతడిలో ఎన్నో ప్రశ్నలు, ఎంతో వేదన.

పై సంఘటనలో ఆ యువకుడి అనుభవం అతడిని ఆత్మన్యూనతకు గురిచేస్తే దానికి బాధ్యులెవరు? వైకల్యం ఉన్నవారిని అర్థం చేసుకుని, జనజీవన స్రవంతిలో కలుపుకోవాలంటే ఎదుటివారే చొరవ చూపాలి. అప్పుడే వారు ఆత్మగౌరవంతో మనగలుగుతారు... అన్న సందేశంతో ముగిసే ఈ షార్ట్‌ఫిల్మ్‌ను తీసింది డెఫ్ రెయిన్‌బో ఫిల్మ్స్ బృందం. సామాజిక చైతన్యం, విలువలపై ఇలాంటి ఎన్నో చిత్రాలను ఈ బృందం తీసింది.

### అభిరుచే కలిపింది

హైదరాబాద్‌లోని 'లా మకాన్'లో ఓ సాయంత్రం వేళ. 20-45 ఏళ్ల మధ్య వయస్కులు 30 మంది దాకా ఉన్నారక్కడ. వారంతా అక్కడ కలుసుకునేలా చేసింది భౌతికంగా వారి వైకల్యమైతే, ప్రవృత్తిపరంగా వారి సృజనశక్తి. వారందరి అభిరుచీ ఒకటే. పదినిమిషాల వ్యవధిలో అందంగా, అర్థవంతంగా సమాజానికి ఏదో చెప్పాలి. అలాగని వారు చిత్రనిర్మాణంలో సుశిక్షితులనుకుంటే పొరపాటే. ఎలాంటి శిక్షణా లేకుండా, మామూలు కెమెరాలతోనే వారు తీస్తున్న చిత్రాలు అబ్బురపరుస్తున్నాయి. ఆలోచింపజేస్తున్నాయి. వారీ రంగంలోకి రావడానికి కారణం... మన చిత్రపరిశ్రమే!

సినిమాల్లో మూగచెవిటి వారిని చిత్రీకరిస్తున్న తీరూ హాస్యం కోసం వైకల్యాన్ని ఉపయోగించడం వారికి ఆవేదన కలిగించింది. దేశంలో దాదాపు రెండు కోట్లమంది మూగ, చెవిటి వారున్నారు. వారి గురించి సరైన సినిమాలు అరుదే. దశాబ్దం క్రితం వచ్చిన 'బ్లాక్' సినిమా ఎన్నో ప్రశంసలు అందుకుంది. అమెరికన్ సైన్ లాంగ్వేజి వాడడంతో ఆ సినిమాలో ఇక్కడివారెవరూ తమను తాము చూసుకోలేకపోయారు. భారతీయ సైన్ లాంగ్వేజ్‌కీ దానికీ చాలా తేడా ఉంది. ఈ అంశాలన్నీ సయ్యద్ ఫరూఖ్ నిజాంను ఆలోచింపజేశాయి. ఫరూఖ్, అతని భార్యా కూడా మూగవారూ, బధిరులే. కామర్స్‌లో డిగ్రీ చదివిన ఫరూఖ్ కోల్‌కతాలో భారతీయ సైన్ లాంగ్వేజిలో శిక్షణ పొందారు. తనలాంటి వారందరినీ ఒక్కచోట చేర్చి వారిలోని సృజనకు పట్టంకట్టాలన్న ఆలోచనతో మూడేళ్ల క్రితం డెఫ్ రెయిన్‌బో ఫిల్మ్స్ సంస్థను ప్రారంభించారు. ఇప్పటికే పలు చిత్రాలు తీసిన ఈ బృందం త్వరలో సొంత యూట్యూబ్ ఛానల్‌ను ప్రారంభించే ప్రయత్నాల్లో ఉంది.

### నలుగురితో కలిసినప్పుడే...

'మాట్లాడలేనంత మాత్రాన మాకు అభిప్రాయాలు లేవని కాదుగా? మూగ బధిరులైన వారెందరో సృజనాత్మక రంగాల్లో రాణిస్తున్నారు. తగిన ప్రోత్సాహం లభిస్తేనే వారి శక్తియుక్తులు సమాజానికి ఉపయోగపడతాయి. మా ఇంట్లో నన్నెప్పుడూ వేరుగా చూడలేదు. స్కూలు మాత్రమే వేరుగా ఉండేది. మిగతా అన్ని సమయాల్లో నేను నలుగురితో కలిసి ఉండేలా జాగ్రత్త తీసుకునేది అమ్మ. అన్నయ్యా చెల్లెళ్లూ అలాగే చూసేవారు. వారంతా నాలో నింపిన స్థైర్యమే నన్ను ఈ స్థాయికి తెచ్చింది. కానీ చాలా ఇళ్లలో ఇలాంటి వాతావరణం ఉండదు' అంటారు ఫరూఖ్. తండ్రితో వ్యాపారబాధ్యతలు పంచుకుంటూనే అతడు చిత్రనిర్మాణ వ్యవహారాలూ చూస్తున్నారు. ఫరూఖ్ ఇద్దరు కుమార్తెలతో సహా కుటుంబసభ్యులందరికీ సంకేత భాష అర్థమవుతుంది. ఇంకా వివరంగా ఏమన్నా చెప్పాలనుకుంటే ఆంగ్లంలో రాసి చూపిస్తారు.

కలలు సాకారం చేసుకోవడంలోనే కాదు, నిజానికి వీరికి నిత్యజీవితమూ సవాలుగానే ఉంటుంది. 'మూగ, చెవిటివారి వైకల్యం పైకి కన్పించదు కాబట్టి ఎవరూ గుర్తించలేరు. దాంతో సంభాషణ కష్టమవుతుంది. చదువుకున్నా ఉద్యోగాలు దొరకవు. ఇప్పుడిప్పుడే కొన్ని సంస్థలు ముందుకు వస్తున్నాయి. సోమాజిగూడ కేఎఫ్‌సీలో సిబ్బంది చాలా మంది ఇలాంటి వారే ఉన్నారు' అని చెప్పారు ఫరూఖ్ సోదరుడు సయ్యద్ మక్సూద్. ఇలాంటి పలు విషయాలను సున్నితంగా, సృజనాత్మకంగా తమ లఘుచిత్రాల ద్వారా చూపుతోంది ఫరూఖ్ బృందం. డెఫ్ రెయిన్‌బో ఫిల్మ్స్ ఆధ్వర్యంలో చిత్రనిర్మాణం గురించే కాక వ్యక్తిత్వ వికాసానికి సంబంధించి కూడా ఫరూఖ్ తరచూ వర్క్‌షాపులు నిర్వహిస్తుంటారు. ఆత్మవిశ్వాసంతో తమను తాము నిరూపించుకుంటున్న డెఫ్ రెయిన్‌బో ఫిల్మ్స్ బృందం అభినందనీయులు కదూ! ★

# శిశువులో పెరుగుదల మరియు అభివృద్ధి దశలు



శిశువులో అభివృద్ధి మరియు పెరుగుదల వేగంగా ఉంటాయి. ఉదాహరణకు శిశువులు పుట్టినప్పటి బరువుతో పోలిస్తే నాలుగు నెలల్లో వారి బరువు రెట్టింపు అవుతుంది. మొదటి పుట్టినరోజునాటికి యిది మూడింతలు అవుతుంది మరియు కనీసం 50% పొడుగు పెరుగుతారు.

## జ్ఞానేంద్రియ స్పందనలు

**స్పర్శ:** శిశువులు తమ భావాలను మరియు అవసరాలను తెలియజేయటానికి స్పర్శను ఉపయోగిస్తారు. మర్దన వలన పిల్లలు సేదతీరుతారు మరియు అది నిద్రపోవటానికి ఉపకరిస్తుంది. 6 నుండి 8 వారాల వయసులో వారు ఎప్పుడైనా 30 నిమిషాలకుపైగా చురుగ్గా ఉంటారు. 4 నెలల వయసులో వారు రెండు చేతుల్ని సమానంగా ఉపయోగిస్తారు.

**దృష్టి:** అప్పుడే జన్మించిన శిశువుల దృష్టి పూర్తి మసగ్గా ఉంటుంది. 6 నుండి 8 వారాల వయసులో దాదాపు 15 నుండి 45 సెం.మీ. పరిధిలో ఒక వైపు నుండి మరో వైపుకు కదులుతున్న తల్లిదండ్రుల కదలికలను వారు వారి నేత్రాలతో గుర్తించగలుగుతారు. 4 నెలల వయసులో వారు ఇంకాస్త దూరంలో ఉన్న వస్తువులను గుర్తించగలుగుతారు.

**వినికిడి:** గర్భంలో ఉన్న చివరి నెలల్లో శిశువుకు కొన్ని శబ్దాలు సుపరిచితాలు అవుతాయి. 6 నుండి 8 వారాల వయసులో వారు స్వరాలకు స్పందిస్తారు. 4 నెలల వయసులో వారు మరిన్ని రకాల శబ్దాలకు స్పందిస్తారు.

## మీ శిశువుల ఎదుగుదల మరియు అభివృద్ధిలో ప్యాంపర్స్ ప్యాంట్స్ ఎలా సహాయ పడతాయి?

శిశువులు పెరుగుతూ, వారి వాతావరణాన్ని అన్వేషించటం మొదలు పెట్టినప్పటి నుండి వారిని మృదువుగా, సౌకర్యవంతంగా, పరిశుభ్రంగా, పొడిగా ఉంచే డయపర్ వారికెంతో అవసరం. శిశువు నిద్రిస్తున్నప్పుడుకాని, కూర్చున్నప్పుడు లేదా ఆడుతున్నప్పుడుకాని వారికి తడి నుండి రక్షణనందించటమే కాదు, వారికి ఎంతో అనువుగా ఉంటాయి ప్యాంపర్స్ ప్యాంట్స్.

**1.** తడిని పీల్చే అదనపు పొరలు మరియు మ్యాజిక్ జెల్ తడిని 12 గంటల వరకు లాక్‌చేసి ఉంచుతాయి. అందువలన, ఎటువంటి ఆటంకం లేకుండా మీ శిశువులు రాత్రంతా హాయిగా నిద్ర పోగలుగుతారు, యిది వారి ఎదుగుదలకు ఎంతో ఉపకరిస్తుంది.

**2.** లీకేజీ వలన తడి కావటం, అది పిల్లల ఛాతి వరకు వ్యాపించటాన్ని ప్యాంపర్స్ ప్యాంట్స్ నిరోధిస్తాయి. తద్వారా పిల్లల్లో సాధారణంగా కనపడే రుగ్మతల్లో ఒకటైన జలుబు నుండి మీ పిల్లలను రక్షిస్తాయి.

**3.** లెగ్ కఫ్స్‌లో ఉపయోగించే ఎలాస్టిక్ మెటీరియల్ చక్కటి పొందికను అందించి, లీకేజీని నిరోధిస్తుంది. సాఫ్ట్ ఎలాస్టిక్‌తో పుల్-అప్ ప్యాంట్ రకము అయినందున, యిది మీ శిశువు నడుం చుట్టూ చక్కగా అమరుతుంది మరియు శిశువు కదలటం వలన డయపర్ వదులు కావటంకాని, ఊడిపోవటం కాని ఉండదు.

మీ శిశువు యొక్క ఆరోగ్యకరమైన ఎదుగుదల కోసం ఒక తల్లిగా మీరు ఎంతో చేస్తుండి ఉండవచ్చును. మరో ముందడుగు వేయండి, మీరింతవరకు ఉపయోగించనట్లయితే, మీ పిల్లల కోసం డయపర్‌ను ఉపయోగించటం ఇక ప్రారంభించండి.

## మీ శిశువుకు ఏ సైజు ప్యాంపర్స్ ప్యాంట్స్ అవసరం?

| | |
|---|---|
| 3-5 కిలోలు | న్యూ బోర్న్ |
| 4-8 కిలోలు | స్మాల్ |
| 7-12 కిలోలు | మీడియం |
| 9-14 కిలోలు | లార్జ్ |
| 12-17 కిలోలు | XL |




## బొమ్మగౌన్లు...

**మ**నకు బోలెడు బొమ్మలు వేయడం, రకరకాల డిజైన్లు గీయడం వచ్చు కదూ. ఆ చక్కని బొమ్మలను ఇప్పుడు ఎంచక్కా మన గౌను మీద కూడా వేసుకోవచ్చు. అమ్మో అమ్మ తిడుతుంది అనుకుంటున్నారా. అస్సలు తిట్టదు. ఎందుకంటే మీరు బొమ్మవేసేది కాగితం మీదేగా. మీరు కాగితం మీద ఓ గౌను బొమ్మను గీసుకుని దాని మీద మీకు నచ్చిన డిజైన్ గీసేయండి. దాని ఫొటోను 'పిక్చర్ దిస్ క్లోతింగ్' వెబ్‌సైట్ వాళ్లకు పంపిస్తే వాళ్లే చక్కని గౌనును అచ్చం మీరు గీసిన డిజైన్‌తో రూపొందించి ఇస్తారు. ఇక వేసుకొని అందరికీ చూపించుకోవడమే!







## పట్టుకోండి

**ప**క్కన ఇచ్చిన ఆకారం కింది నలుచదరపు రంగుల గడుల్లో దాగి ఉంది. అది ఎక్కడ ఉందో పట్టుకోండి.



| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | | | | | | | | | | |
| 2 | | | | | | | | | | | | |
| 3 | | | | | | | | | | | | |
| 4 | | | | | | | | | | | | |
| 5 | | | | | | | | | | | | |
| 6 | | | | | | | | | | | | |
| 7 | | | | | | | | | | | | |
| 8 | | | | | | | | | | | | |
| 9 | | | | | | | | | | | | |
| 10 | | | | | | | | | | | | |
| 11 | | | | | | | | | | | | |
| 12 | | | | | | | | | | | | |




## ఏ రెండూ...

**ఈ** ఫ్లవర్‌వేజుల్లో ఏ రెండూ ఒకేలా ఉన్నాయో గుర్తించండి.

## చదవగలరా...

**ఇ**క్కడ కొన్ని రంగుల పేర్లు ఆంగ్లంలో రాసి ఉన్నాయి. అయితే, రాసిన అక్షరాలను కాకుండా ఆ అక్షరాలు ఏ రంగులో రాసి ఉన్నాయో ఆ రంగు పేరును వేగంగా చదవగలరా.

YELLOW BLUE ORANGE
BLACK RED GREEN
PURPLE YELLOW RED
ORANGE GREEN BLUE
BLUE RED PURPLE
YELLOW RED GREEN

## తేడాలేంటి?

**ఈ** రెండు బొమ్మల మధ్య ఉన్న ఎనిమిది తేడాలను కనుక్కోండి





## ముక్క ఏది?

**ప**క్కన ఇచ్చిన ముక్కల్లో ఆ పక్కన ఇచ్చిన దృశ్యానికి సంబంధించనిది ఒక్కటే ఉంది. అది ఏదో కనిపెట్టండి?

1 2 3 4

## గబగబా

**ఈ** పదాలను గబగబా అనండి.

BIG BLACK BATS BLOW

SIX SICK HICKS

SHILLY-SHALLIED SOUTH

TIDY TIGER TRIED A TIE

STUPID SUPERSTITION

## దారి కనుక్కోండి

**తే**నెటీగ పువ్వును చేరే దారి కనుక్కోండి.

## రంగులేద్దాం



## పిల్లల పేచీలు

**ఒ**కరోజు రామలింగడు సభకు బాగా ఆలస్యంగా వచ్చాడు. అప్పటికే కృష్ణదేవరాయలు ఆయన కోసం చాలా ఎదురు చూస్తూ ఉన్నాడు. వచ్చీ రాగానే రామలింగడితో 'ఎందుకింత ఆలస్యమైంది రామలింగా' అని అడిగాడు. దానికి రామలింగడు 'మా చిన్న బాబు బాగా పేచీ పెడుతున్నాడు. వాడిని ఊరుకోబెట్టి వచ్చే సరికి ఇలా ఆలస్యమైంది ప్రభూ' అని చెప్పాడు. దానికి రాజు పెద్దగా నవ్వాడు. 'అయ్యో రామలింగా... నీకు చిన్న పిల్లల్ని ఊరుకోబెట్టడం రావట్లేదా... హ్హా హ్హా హ్హా' అంటూ మళ్లీ నవ్వాడు. 'ఎలా ఊరుకో బెట్టాలో నేను చెబుతాను చూడు. ఇప్పుడు నువ్వు పిల్లాడివన్నమాట, నేను నిన్ను ఎలా ఊరుకోబెడతానో చూడు' అన్నాడు. వెంటనే రామలింగడు సరే అని 'నాకు ఆవు కావాలీ....' అన్నాడు. 'ఆవును తీసుకురండి' అన్నాడు రాజు. 'నాకు ఆవు పాలు కావాలి' అన్నాడు రామలింగడు. 'ఓ... పాలే కదా తీయండి' అన్నాడు రాజు. పాలు పితికి ఓ గిన్నెలో పోసి రామలింగడికి ఇచ్చారు వాళ్లు. కొన్ని పాలు తాగాడు రామలింగడు... మిగిలిన పాల గిన్నెను రాజుకు ఇచ్చి... 'ఈ పాలు మళ్లీ ఆవులో పెట్టే యండీ... పిండిన దగ్గరే పెట్టేయండీ...' అని గోలచేయసాగాడు. రాయలకు ఏం చేయాలో అర్థం కాక 'పిల్లల పేచీలు ఇలా ఉంటాయా... బాబోయ్...' అనుకుంటూ మెల్లగా అక్కడి నుంచి లేచి పక్కకు వెళ్లిపోయాడు.



## జవాబులు

తేడాలేంటి: 1. మొదటి అమ్మాయి కాలర్ మీద చుక్కలు 2. అబ్బాయి టీషర్ట్ మీద డిజైన్ 3. పాప చొక్కా మీద గుండీ 4. చివరి అబ్బాయి కనుపాప 5. గులాబీ పువ్వుల మధ్యలో ఎర్ర గులాబీ 6. ఏనుగు దంతం 7. కేకు మీద క్యాండిల్ మంట రంగు 8. కేకు మీద డిజైన్.

ముక్క ఏది?: 2

ఏ రెండూ...: 1, 5

పట్టుకోండి: రెండో అడ్డు వరుసలో ఐదో గడి నుంచి కిందకి చూడండి.

# నోరూరించే నువ్వుల పూర్ణం..!




**కావలసినవి**

**బియ్యప్పిండి లేదా జొన్నపిండి:** 2 కప్పులు, **ఖర్జూరాలు/ఎండు అంజీరాలు:** కప్పు, **కొబ్బరి తురుము:** కప్పు, **నువ్వులు:** 4 టేబుల్‌స్పూన్లు, **ఉప్పు:** చిటికెడు, **నెయ్యి:** 2 టీస్పూన్లు



## ఖర్జూర మోదకాలు

**తయారుచేసే విధానం**

★ బాణలిలో నువ్వులు వేసి వేయించి చల్లారాక మెత్తని పొడిలా చేయాలి.

★ ఖర్జూర ముక్కలు మిక్సీలో వేసి మెత్తగా రుబ్బాలి. అందులోనే నువ్వులు, తాజా కొబ్బరి తురుము వేసి బాగా కలపాలి. ఈ మిశ్రమాన్ని గుండ్రని ఉండల్లా చేసి పక్కన ఉంచాలి.

★ బియ్యప్పిండి లేదా జొన్నపిండిలో ఉప్పు వేసి మరిగించిన నీళ్లు కొంచెంకొంచెంగా పోస్తూ కలపాలి. నాలుగైదు నిమిషాల తరవాత పిండిని బాగా మృదువుగా కలపాలి. చేతులకి నెయ్యి రాసుకుని పిండిని గుండ్రని ఉండల్లా చేసుకుని చిన్న బిళ్లల్లా వత్తి వాటి మధ్యలో ఖర్జూర మిశ్రమంతో చేసిన ఉండని పెట్టి అంచుల్ని మూసేసి మళ్లీ గుండ్రని ఉండలాగానీ వెల్లుల్లి ఆకారంలోగానీ చేయాలి. ఇప్పుడు వీటిని ఆవిరిమీద పది పదిహేను నిమిషాలు ఉడికించి దించాలి.

## ప్రసాదం పులిహోర

**కావలసినవి**



**బియ్యం:** 2 కప్పులు, **చింతపండు:** పెద్ద నిమ్మకాయంత, **ఆవాలు:** టీస్పూను, **మినప్పప్పు:** 2 టేబుల్‌స్పూన్లు, **సెనగపప్పు:** 2 టేబుల్‌స్పూన్లు, **దనియాలు:** టీస్పూను, **నువ్వులు:** టీస్పూను, **ఇంగువ:** పావుటీస్పూను, **పసుపు:** ముప్పావు టీస్పూను, **కరివేపాకు:** 12 రెబ్బలు, **ఎండుమిర్చి:** ఎనిమిది, **ఉప్పు:** రుచికి సరిపడా, **బెల్లం తురుము:** పావుటీస్పూను, **నువ్వుల నూనె:** 4 టేబుల్‌స్పూన్లు

**తయారుచేసే విధానం**

★ చింతపండుని మరిగించిన నీళ్లలో పది నిమిషాలు నానబెట్టి గుజ్జు తీయాలి.

★ బాణలిలో 2 టీస్పూన్ల నూనె వేసి టేబుల్‌స్పూను మినప్పప్పు, టీస్పూను సెనగపప్పు వేసి వేయించాలి. తరవాత దనియాలు, నువ్వులు, ఎండుమిర్చి కూడా వేసి వేయించి చల్లారాక పొడి చేయాలి.

★ అన్నం ఉడికించి బేసిన్‌లో వేసి చల్లారనివ్వాలి. అందులో 2 టేబుల్‌స్పూన్ల నూనె వేసి బాగా కలపాలి. ఉప్పు, పసుపు, కరివేపాకు వేసి కలపాలి.

★ బాణలిలో మిగిలిన నూనె వేసి ఆవాలు, మెంతులు, ఎండుమిర్చి వేసి వేగాక, ఇంగువ, చింతపండు గుజ్జు వేసి అందులోని నీరంతా ఆవిరైపోయి, నూనె తేలే వరకూ ఉడికించాలి. తరవాత బెల్లం వేసి కలిపి దించి, అన్నంలో కలపాలి. తరవాత పప్పులపొడి కూడా వేసి బాగా కలపాలి.

మరిన్ని వంటల కోసం www.eenadu.net లోని రుచులు పేజీ చూడండి.

## పాలతాలికలు

**కావలసినవి**

**బియ్యం:** కప్పు, **పాలు:** అరలీటరు, **సగ్గుబియ్యం:** 4 టేబుల్‌స్పూన్లు, **బెల్లంతురుము:** కప్పు, **యాలకులపొడి:** చిటికెడు, **మంచినీళ్లు:** తగినన్ని, **యాలకులపొడి:** టీస్పూను

**తయారుచేసే విధానం**

★ బియ్యం నాలుగు గంటలపాటు నానబెట్టి నీళ్లు వంపేసి తడి లేకుండా కాస్త ఆరనిచ్చి మిక్సీలో వేసి మెత్తని పొడిలా చేయాలి.



★ మందపాటి గిన్నెలో పాలు పోసి మరిగించి సగ్గుబియ్యం వేసి ఉడికించాలి.

★ మరో గిన్నెలో బెల్లం తురుము వేసి తగినన్ని నీళ్లు పోసి కరిగిన తరవాత, రెండు టీస్పూన్ల బియ్యప్పిండి కూడా వేసి కలిపి లేత పాకం రానిచ్చి, స్టవ్‌మీద నుంచి దించి పక్కన ఉంచాలి.

★ ఇప్పుడు మిగిలిన బియ్యప్పిండిలో తగినన్ని నీళ్లు పోసి జంతికల పిండిలా కలపాలి. ఈ మిశ్రమాన్ని జంతికల గొట్టంలో పెట్టి, లేదా తాలికల పళ్ళెంలో మరిగిన పాయసంలో వత్తి, ఉడికించాలి. తాలికలు పూర్తిగా ఉడికిన తరవాత బెల్లం పాకం వేసి నెమ్మదిగా కలిపి యాలకులపొడి డ్రైనట్స్ ముక్కలు వేసి కలిపి దించాలి.

## నువ్వుల పూర్ణాలు

**కావలసినవి**

**నువ్వులు:** 2 కప్పులు, **పల్లీలు:** కప్పు, **కొబ్బరితురుము:** కప్పు, **బెల్లం తురుము:** మూడు కప్పులు, **నూనె:** వేయించడానికి సరిపడా; **పైపూతకోసం: బియ్యం:** 4 కప్పులు, **మినప్పప్పు:** 2 కప్పులు, **ఉప్పు:** రుచికి సరిపడా

**తయారుచేసే విధానం**

★ మినప్పప్పు, బియ్యం కడిగి విడివిడిగా సుమారు ఆరుగంటలపాటు నాననిచ్చి, మెత్తగా రుబ్బుకోవాలి.

★ బాణలిలో నువ్వులు వేసి సిమ్‌లో వేయించాలి. తరవాత వేరుసెనగపప్పు కూడా వేయించాలి. ఆరాక ఈ రెండింటినీ మిక్సీలో వేసి పొడి చేయాలి. తరవాత అందులోనే కొబ్బరి తురుము, బెల్లం తురుము వేసి రుబ్బాలి. ఇప్పుడు ఈ పూర్ణాన్ని గుండ్రని ఉండల్లా చేసి మినప్పిండి మిశ్రమంలో ముంచి కాగిన నూనెలో వేయించి తీయాలి.



# ఇచట సంతోషం కొలవబడును

ఒకప్పుడు సంపదను మాత్రమే అభివృద్ధికి కొలమానంగా భావించేవారు. కానీ ఇప్పుడు ఆ స్థానాన్ని ఆనందానికీ ఇస్తున్నారు. మనిషి ఎంత ఆనందంగా ఉంటే అంత అభివృద్ధి చెందినట్టుగా లెక్కిస్తున్నారు. అందుకే ప్రభుత్వాలు సైతం ప్రజలను ఆనందంగా ఉంచడానికి ఏకంగా మంత్రిత్వ శాఖలనే ఏర్పాటు చేస్తున్నాయి. దేశ పురోగతిని ఆనందంతోనే కొలుస్తున్నాయి. ఇప్పటివరకూ విదేశాలకు మాత్రమే పరిమితమైన ఈ ఒరవడి ఇప్పుడు భారతదేశానికీ విస్తరించింది.








రోటీ.. కపడా.. మకాన్.. సామాన్యులకు ఈ మూడూ కల్పించడానికే ప్రభుత్వాలు పనిచేస్తాయన్నది పాత మాట. వీటితోపాటు ఆనందాన్ని కూడా అందించడమే రాజ్యం లక్ష్యమన్నది నేటి మాట. దీన్ని ఆచరించి చూపేందుకు మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు కొత్తగా మినిస్ట్రీ ఆఫ్ హ్యాపీనెస్ (ఆనంద మంత్రిత్వశాఖ) ఏర్పాటు చేశాయి. ప్రజలు ఆనందంగా జీవించడానికి కావల్సిన వాతావరణాన్ని సృష్టించడం దీని ముఖ్యఉద్దేశం. ఆనందం అనేది సంపదతోనో, ఖరీదైన వస్తువులతోనో కాకుండా మానసిక ప్రశాంతత ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది, కాబట్టి దానికి సంబంధించిన కార్యక్రమాలను రూపొందిస్తారు. ప్రజల ఆనందాన్ని కొలిచే కొలమానాలు తయారుచేయడం, వీటిని ప్రామాణికంగా తీసుకుని రాష్ట్ర తలసరి ఆనందాన్ని (స్టేట్ గ్రాస్ హ్యాపీనెస్) లెక్కించడం లాంటి కార్యక్రమాలను ఈ శాఖ చేపడుతుంది.

రాష్ట్రంలో జరుగుతున్న విద్యార్థుల ఆత్మహత్యలను చూసి చలించిన మధ్యప్రదేశ్ ప్రభుత్వం, భూటాన్ స్ఫూర్తితో ఓ కొత్త ఆనంద మంత్రిత్వశాఖను ఏర్పాటు చేసింది. రాజ్య ఆనంద్ సంస్థాన్ పేరుతో ఏర్పాటు చేసిన ఈ శాఖకు సంబంధించిన విధివిధానాలను ముఖ్యమంత్రి శివరాజ్‌సింగ్ చౌహాన్ పర్యవేక్షిస్తారు. దేశంలోనే ఇలాంటి ఓ శాఖను ఏర్పరచిన తొలి రాష్ట్రం మధ్యప్రదేశ్.

### ఆంధ్రప్రదేశ్‌లో...

సన్‌రైజ్ ఏపీ విజన్ 2029లో భాగంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆనంద మంత్రిత్వ శాఖను ఏర్పాటు చేసింది. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు అధీనంలో ఈ శాఖ ఉంటుంది. మానసిక, శారీరక ఆరోగ్యం, విద్య, సమయపాలన వంటి అంశాలను అభివృద్ధి చేయడం ద్వారా ప్రజల జీవన విధానం మెరుగుపడి, ఆనందంతో జీవించేలా చేయడం దీని విధి. ఆనందంగా ఉండాలంటే ఏమేం చేయాలో సర్వే చేసి, కొన్ని ప్రమాణాలను నిర్దేశిస్తారు. వాటి ఆధారంగా చేపట్టవలసిన కార్యక్రమాలను రూపొందిస్తారు. ప్రజలను ఆనందంగా ఉంచాలన్న ఉద్దేశంతో ఇటీవలే హ్యాపీ సండే కార్యక్రమాన్ని ప్రారంభించి, పల్లెలూ, పట్టణాల్లో ఘనంగా నిర్వహిస్తున్న సంగతి తెలిసిందే. వివిధ సాంస్కృతిక కార్యక్రమాలనూ ఇందులో భాగం చేశారు. ఈ శాఖ ఆధ్వర్యంలోనే సంక్రాంతి, రంజాన్, క్రిస్మస్ మొదలైన పండగల సమయంలో రాష్ట్ర ప్రభుత్వం ప్రజలకు కానుకలనూ అందిస్తోంది.

### ఎలా పనిచేస్తుందంటే..

రాష్ట్ర తలసరి ఆనందాన్ని లెక్కించడానికి ప్రభుత్వం ఒక కమిటీని ఏర్పాటు చేస్తుంది. వీటితోపాటు ఆనందాన్ని పెంపొందించడానికి కార్యాచరణ ప్రణాళికలను కూడా రూపొందిస్తుంది. ఆనందానికి సంబంధించిన వివిధ సర్వేలనూ, నిపుణుల అభిప్రాయాలనూ సేకరిస్తుంది. యోగా, ధ్యానం, ఆధ్యాత్మిక కార్యక్రమాలను నిర్వహించడం, వివిధ కళలను ప్రోత్సహించడం... ఇలా సుమారు డెబ్బై రకాల కార్యక్రమాలను చేపడుతుంది. రాష్ట్రంలోని వయోవృద్ధులను ఉచితంగా తీర్థయాత్రలకు తీసుకెళ్లడం లాంటి కార్యక్రమాలను కొత్తగా రూపొందిస్తుంది.

హ్యాపీ మినిస్ట్రీకి సంబంధించిన మొత్తం సమాచారాన్ని ఆ శాఖకు సంబంధించిన వెబ్‌సైట్‌లో ఎప్పటికప్పుడు అప్‌డేట్ చేస్తుంటారు. రాష్ట్ర ప్రజలు ఇందులో వలంటీర్లుగా చేరొచ్చు. ఇలా చేరినవారు గ్రామాలకూ, పాఠశాలలకూ వెళ్లి ఆనంద్ ఉత్సవ్, హ్యాపీ వీక్ లాంటి కార్యక్రమాలను నిర్వహిస్తుంటారు. వీటిలో పాల్గొన్నవారికి సర్టిఫికెట్లూ ఇస్తారు.

### క్యాలెండర్‌తో ఆనందం..

విజయాన్ని సాధించినపుడు లేదా ఏదైనా లక్ష్యానికి చేరువైనపుడు ఆనందం కలగడం సహజం. దీన్ని ఆధారంగా చేసుకునే ఏడాదంతా ఆనందంగా ఎలా ఉండాలో చెబుతూ మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఒక క్యాలెండర్‌ను రూపొందించింది. వలంటీర్ల ద్వారా ఈ క్యాలెండర్‌ను ప్రజల్లోకి తీసుకెళుతోంది. ఆటలు ఆడటం, కృతజ్ఞతలు తెలపడం, నేర్చుకోవడం, లక్ష్యాలు నిర్దేశించుకోవడం... ఇలా ప్రతీ నెలనూ ఒక కొత్త పనికి అంకితం చేస్తూ ఆ నెలలో పూర్తిచేయాల్సిన చిన్నచిన్న లక్ష్యాలను పేర్కొంటారు. అంతేకాకుండా ఒక రోజులో ఎన్ని పనులు పూర్తిచేశారో తెలిపేలా టిక్ మార్కులు పెట్టుకోవాలి. నెల గడిచిన తర్వాత ఎన్ని ఎక్కువ టిక్‌మార్కులు వస్తే మీరు అంత సంతోషాన్ని పొందినట్లుగా లెక్కిస్తారు.

### ఆనందానికీ కొలత...

ఆనందానికి ప్రమాణం ఏమిటి? అసలు దాన్ని ఎలా కొలవాలి? ఇలాంటి ప్రశ్నలకు సమాధానంగానే ఐక్యరాజ్య సమితి ఆరు అంశాలతో కూడిన ఒక జాబితాను రూపొందించింది. ఆరోగ్యకర జీవన ప్రమాణాలు, తలసరి స్థూల జాతీయోత్పత్తి, స్వేచ్ఛ, దాతృత్వం, సామాజిక భద్రత, అవినీతి రాహిత్యం లాంటి అంశాలు ఇందులో ఉంటాయి. వీటి ఆధారంగానే ఐరాస 155 దేశాల్లో ఓ సర్వేను నిర్వహించింది. ఇందులో మొదటి స్థానంలో నార్వే నిలిచింది. భారతదేశం 122వ స్థానంలో ఉంది. మన పొరుగుదేశాలైన పాకిస్థాన్ 80, నేపాల్ 99 స్థానాల్లో ఉన్నాయి. ఆనందానికి మంత్రిత్వ శాఖలను ఏర్పాటు చేస్తున్న ప్రభుత్వాలు భవిష్యత్తులో ప్రజలకు ఆనందాన్ని పంచడమే మా ప్రధాన అజెండా అని చెబుతాయేమో! 



# రాశి ఫలం

గ్రహబలం (ఆగస్టు 20 - 26)

డా॥ శంకరమంచి రామకృష్ణ శాస్త్రి





**మేషం** అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం

విజయావకాశాలు తక్కువగా ఉన్నా తెలివిగా వ్యవహరిస్తే కార్యసిద్ధి లభిస్తుంది. ధైర్యంగా ముందడుగు వేయండి. మీరు చేసే ఆలోచనలు ఆర్థిక ఎదుగుదలకు ఉపయోగపడతాయి. ప్రోత్సాహం కోసం ఎదురుచూడకుండా సొంతంగా పనులు చేయండి. శత్రువులపై విజయం సాధిస్తారు. చంచలత్వం రానీయవద్దు. సూర్యస్తుతి వల్ల ఆరోగ్యం చేకూరుతుంది.



**వృషభం** కృత్తిక 2,3,4 పాదాలు; రోహిణి, మృగశిర 1,2 పాదాలు

శుభకాలం నడుస్తోంది. వినూత్నంగా ఆలోచించాలి. భూ, గృహ, ధన లాభాలు సూచితం. ఉద్యోగ వ్యాపారాల్లో విశేషమైన శుభఫలితాలున్నాయి. సమాజంలో ప్రత్యేక గౌరవం లభిస్తుంది. దైవశక్తి అపారంగా ఉంది. లక్ష్య సాధనకు బాగా కృషిచేస్తే మంచి ప్రతిఫలం దక్కుతుంది. ఒక శుభవార్త వింటారు. లక్ష్మీధ్యానం వల్ల అదృష్టవంతులు అవుతారు.



**మిథునం** మృగశిర 3, 4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పాదాలు

ఆత్మవిశ్వాసంతో పనిచేస్తే తక్షణ విజయం లభిస్తుంది. ఆశించిన ఫలితాలు త్వరలోనే అందుతాయి. బంధుమిత్రుల వల్ల ప్రశాంతత లభిస్తుంది. కుటుంబ సభ్యుల సహకారంతో ఒక మంచి నిర్ణయం తీసుకుంటారు. ఒక విషయంలో మోసపోయే సూచనలున్నాయి. కలహాలకు అవకాశముంది. ఆవేశంగా మాట్లాడవద్దు. ఆరోగ్యం బాగుంటుంది. గణపతి ధ్యానం మంచిది.



**కర్కాటకం** పునర్వసు 4వ పాదం; పుష్యమి, ఆశ్లేష

చేపట్టే పనుల్లో మిశ్రమ ఫలితాలున్నాయి. ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. పొరపాటు జరగకుండా పనిచేయండి. ముఖ్య కార్యాల్లో ఏకాగ్రత అవసరం. అందరినీ నమ్మడంవల్ల ఇబ్బందులు తలెత్తే అవకాశం ఉంది. ఉద్యోగంలో అభివృద్ధి ఉంటుంది. అనవసర విషయాల్లో తలదూర్చవద్దు. ప్రశాంత జీవనం కొరకు శివారాధన చేయండి.



**సింహం** మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం

తెలివిగా వ్యవహరించి విజయం సాధిస్తారు. అనుకూలమైన కాలం నడుస్తోంది. సకాలంలో పనులు పూర్తి అవుతాయి. అదృష్టం వరిస్తుంది. అనూహ్యంగా ఒక మంచి జరుగుతుంది. మిత్రుల సహకారంతో ఆర్థికంగా బలపడతారు. విచారకర సంఘటనలున్నా తెలివితేటలు ప్రదర్శిస్తే సమస్యలు దూరమవుతాయి. ప్రయాణలాభం ఉంది. సుబ్రహ్మణ్య ఆరాధన మంచిది.



**కన్య** ఉత్తర 2, 3, 4 పాదాలు; హస్త, చిత్త 1, 2 పాదాలు

ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆశయం నెరవేరుతుంది. ఒత్తిడిని తట్టుకుని పనిచేస్తే విజయం సాధిస్తారు. ఆర్థికంగా లాభపడతారు. బంధుమిత్రులతో కలిసి ఆనందంగా గడుపుతారు. ఒడుదొడుకులను బుద్ధిబలంతో అధిగమిస్తారు. ఒక వార్త ఇబ్బంది కలిగిస్తుంది. ఆరోగ్యంపై శ్రద్ధ పెంచాలి. సూర్యధ్యానం శుభాన్నిస్తుంది.



**తుల** చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు

విజయావకాశాలు పుష్కలంగా ఉన్నాయి. తగినంత ప్రయత్నం చేస్తే మంచి ఫలితాలు వస్తాయి. శుభాలు జరుగుతాయి. ప్రయత్నాలు కార్యరూపాన్నిస్తాయి. శక్తివంచన లేకుండా కష్టపడాలి. అదృష్టయోగం ఉంది. ధనధాన్య లాభాలున్నాయి. వ్యాపారపరంగా గొప్ప శుభకాలం. కాలాన్ని వృథా చేయాలని ప్రయత్నించేవారున్నారు, పట్టించుకోవద్దు. లక్ష్మీస్తుతి ఉత్తమం.



**వృశ్చికం** విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ

అదృష్టయోగముంది. ఉత్సాహంగా పనిచేయాలి. ఆశించిన దానికంటే ఉత్తమ ఫలితం లభిస్తుంది. ధైర్యంగా నిర్ణయాలు తీసుకోండి. అంతా మంచే జరుగుతుంది. ఆర్థికాంశాల్లో పురోగతి ఉంది. ఆధ్యాత్మికశక్తి కాపాడుతోంది. సంతోషం కలిగించే వార్తలు వింటారు. విందు వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. ప్రయాణాలు కలిసి వస్తాయి. శివారాధన శక్తినిస్తుంది.



**ధనుస్సు** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం

వారం మధ్యలో శుభఫలితాలున్నాయి. పెద్దల సలహాలపై పనులు చేయండి. తొందరపాటు నిర్ణయాలు వద్దు. మనకున్న సామర్థ్యంతోనే విజయం సాధించాలి. అడుగడుగునా ఆటంకపరిచే వారుంటారు. తెలివితో వ్యవహరిస్తే నష్టాల్ని నివారించవచ్చు. ఆర్థిక వ్యవహారాల్లో జాగ్రత్తగా ఉండండి. ఆరోగ్యంపై శ్రద్ధ అవసరం. నవగ్రహ స్తోత్రం పఠించాలి.



**మకరం** ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు; శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు

మంచి ఫలితాలున్నాయి. ఉత్సాహంగా పనుల్లో పాల్గొనాలి. కొత్త ఆనందానుభూతి లభిస్తుంది. విజయం కోసం బాగా కష్టపడాలి. వారం మధ్యలో శుభయోగం ఉంది. ఆర్థిక విజయం ఉంది. అవసరాలకు మించిన ఖర్చు కనిపిస్తోంది. మిత్రుల వల్ల ఒక పని పూర్తవుతుంది. అవసరానికి ఆదుకునేవారున్నారు. సమాజంలో గౌరవం పెరుగుతుంది. లక్ష్మీ దర్శనం శుభాన్నిస్తుంది.



**కుంభం** ధనిష్ఠ 3, 4 పాదాలు; శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు

సంతృప్తికరమైన ఫలితాలు సాధిస్తారు. పట్టుదలతో ఒక్కొక్క మెట్టూ ఎక్కుతూ అభివృద్ధినందుకుంటారు. కుటుంబసభ్యులకు బాగుంటుంది. వారి సహకారంతో ఒక కార్యం పూర్తిచేస్తారు. సమష్టి కృషివల్ల ధనయోగం పడుతుంది. అర్హతను పెంచుకుంటూ సరికొత్త రంగాల్లో ప్రయత్నాలు ప్రారంభించాలి. దైవశక్తి రక్షిస్తోంది. ఆరోగ్యం అనుకూలిస్తుంది. ఆదిత్య హృదయం చదవాలి.



**మీనం** పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి

పనుల్లో శీఘ్ర విజయం ఉంది. ఆశించిన ప్రతిఫలం చేరువలోనే ఉంది. ఆత్మస్థైర్యం గొప్పవారిని చేస్తుంది. ఉత్తమ భవిష్యత్తుకు బాటలు వేస్తారు. అదృష్టం కలిసి వస్తుంది. సమాజంలో ప్రత్యేకమైన గుర్తింపు లభిస్తుంది. ఉద్యోగ వ్యవహారాల్లో ప్రతిభను ప్రదర్శిస్తారు. కుటుంబపరంగా ప్రశాంతజీవనం కొనసాగిస్తారు. ఆర్థిక లాభం ఉంది. శుభవార్త వింటారు. అష్టలక్ష్మీ ధ్యానం శుభప్రదం.

